శ్రీరస్తు.

# రామదాసు

ఇది

బళ్లారిలోనుండు, హైదరాబాదు హైకోర్టు వకీలు

## ధర్మవరము గోపాలాచార్యులచేత

రచియింపఁబడి

"ఆంధ్రనాటకపితామహుఁ"డని

బిరుదుగాంచినట్టియు, కీర్తిశేషులైనట్టియు

## ధర్మవరము రామకృష్ణమాచార్యులకు

సంకితమైనది.

ప్రకాశకుఁడు:

కురుకూరి సుబ్బారావు,

సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.

ఏడవకూర్పు 2000 ప్రతులు.

కాకినాడ:

కాకినాడముద్రాక్షరశాలయందు, ముద్రింపఁబడియె.

1935.



[వెల ఒక రూపాయి.]

## ఈ నాటకమునందలి ముఖ్యపాత్రలు.

---

### పురుషులు.

రామదాసు:-(గోపన్న - కథానాయకుఁడు) Act I, Act II, S. 3 Act III, S. 1, 2 & 4. Act IV, S. 2 & 3, Act V, S, 2, 4, 7 & 8.

కబీరుదాసు:-(రామభక్తుడు) Act I, S, 1, Act III, S, 1 & 2, Act V, S. 3, 4, 6, 7 & 8,

తానీషా:-(గోలకొండ దొర) Act IV, S. 3, Act V, S. 3, 4, 6, 7, 8

అక్కన్న:-(రాజమంత్రి) రామదాసు మేనమామ Act II, S. 3

రఘురాముఁడు:-(రామదాసు కుమారుఁడు) Act III, S. 1, 2, 3 & 4, Act IV, S. 2 & 3, Act V, S. 8

మహమ్మద్ బేగ్:-(మహమ్మదీయ ప్రధాని) Act IV, S. 1 & 3

బల్వంతరావు:-(రాజపుత్ర సేనాని) Act IV, S, 2 & 3

అల్లాఉద్దీన్:-(భద్రాచలం తహశ్శీల్ దారుఁడు) Act 1

అహ్మక్ షా:-(కారాగృహ రక్షకుఁడు) Act V, S. 1, 6, 7 & 8

కలందర్ బేగ్:-(భటాధ్యక్షుఁడు) Act V, S. 1

నబీ<br>ఖాదర్ } (రాజభటులు) Act III, S. 3 & 4

రాముఁడు<br>లక్ష్మణుఁడు } (దేవతలు) Act V, S. 6 & 8

### స్త్రీలు

సితారాబేగం:-(రాజుభార్య) Act II, S. 2, Act IV, S. 1 & 3, V, S. 6 & 8

దిలారా:-(రాజపుత్రి) Act II, S. 2

శ్యామలాంబ:-(అక్కన్న భార్య) Act II, S, 2

కమలాంబ:-(కన్య) Act II, S. 2 & 3

రామదాసుభార్య:- Act III, S. 1, 2 & 4, Act IV, S. 2 & 3, Act V, S. 8

షర్బత్ జాన్:-(వేశ్య) Act III, S. 4

దమ్మక్క:-Act I

తురక - దాసరి - రెడ్లు - చాటువాడు - సిద్ధాంతి - బ్రాహ్మణులు.

---

# రామదాసునాటకము.

## నాల్గవకూర్పుపీఠిక.

(మొదటికూర్పులోని భాగము.)

"నేను హైద్రాబాదునగరమున చిరకాలము వసించి, భద్రాచల రామదాసు చరిత్రను విమర్శించియున్నాఁడను. ఈ నాటకముయొక్క కథాభాగము చరిత్ర ననుసరించియున్నది. రెండువందల సంవత్సరముల క్రిందట గోలకొండ రాజ్యపాలకుఁడగు తానీషాకాలమున నక్కన్నయను నియోగిబ్రాహ్మణుఁడు రాజమంత్రియై యుండెను. అతనికి గోపన్న మేనల్లుఁడు. ఇతఁడే రామదాసు. ఇతఁడు కబీరుదాసువలన రామమంత్రోపదేశముఁబడసి సతతము రామసేవాతత్పరుఁడై తన సర్వస్వము దానముఁజేసి భద్రాచలమునకు నడతెంచి యందు దైవాజ్ఞగ తహశీల్దారుద్యోగమున ప్రవేశించి తానీషాయొక్క యౌదార్యధర్మగుణంబులు నమ్మి ప్రజల పన్నుపైకము వ్యయపఱచి శ్రీరాములకు దేవాలయము రమణీయముగ నిర్ణయించెను. కొందరు మహమ్మదీయు లసూయచే పగఁబూని, తానీషాను మోసపఱిచి, రామదాసును చెఱపట్టించిరి. శరణాగతరక్షకుఁడును భక్తపాలకుఁడు నగు పరమాత్ముఁడు రామదాసును గాపాడి తానీషారామదాసులకు ముక్తియొసఁగెను. తానీషా భద్రాచలమును శ్రీరామునకు జాగీరుగ సమర్పించెను. ఈ దినమువఱకు భద్రాచల మమితమహిమతోడ వెలుఁగుచున్నది. ఇప్పటికిని గోలకొండలో రామదాసునుంచిన చెఱసాల చూపట్టుచున్నది. ఈకథను పొదవెట్టు నాటకంబున ప్రేక్షకుల యుల్లములకు నెలమిగలిగించు రంగములు కొన్నిసందానితములై యున్నవి. పౌరులు మొదలగు సామాన్యపాత్రలకా కాలమునుండి యిదివఱకు నుపయోగింపఁడు మిశ్రభాష వ్రాసియున్నాఁడను. కబీరు మొదలగు తురకవేషధారులకు కొన్నిచోట్ల నచ్చమగు నుర్దుభాషయును ప్రక్కననే తెనుగును వ్రాసియున్నాఁడను; వేషధారుల శక్తికొలఁది, దర్శకుల రక్తికొలఁది నీమాటలు వాడవచ్చును."

మొదటికూర్పును ముద్రించిన పిమ్మట దానిప్రతులు శీఘ్రముగ విక్రీతములైనందున, రెండవ మూడవ కూర్పుల నాతురంబుగ ముద్రింపింపవలసివచ్చెను. అందుచేత నామిత్రులు సూచించియుండినట్టియు, నాకు స్ఫురించినట్టియు విషయములను వాటియందు బొందుపఱచి ప్రకటించుటకు వీలులేకపోయెను. రాంకబీరు, రుక్మిణీకృష్ణీయ నాటకముల నే నీసంవత్సరమునందు వ్రాసినపిదప నాకవకాశము కలిగినందున రామదాసునాటకంబును విస్తరించి, నాల్గవకూర్పును బ్రచురించినాఁడను.

ముఖ్యంబుగ పుత్రుని గురుదక్షిణగ నొసంగునప్పుడును, పుత్రుఁడు బావిలోఁ బడినప్పుడును, తహాశీల్‌దారుని యుద్యోగము లభించినప్పుడును, కారాగృహమందున్నప్పుడును, రామదాసువేషధారి, యా యా సందర్భములకు దగిన వేరువేరురాగములయందు కీర్తనలనుబాడి, కీర్తిశేషులగు త్యాగరాజు మొదలగు దైవభక్తుల ననుకరించి, యుత్సాహ, భక్తివినయార్తుల నగుపఱచి పరమాత్ముని ప్రభావ ప్రకటనచేత, భక్త్యానందములను ప్రేక్షకులమనములయందు నెలకొల్పుట యోగ్యమని యనేకులు నాకు సూచించిరి. ఈకారణంబున రామదాసుకు (10) పదిపాటల నెక్కువగా నాయాభాగములయందు బొందించినాఁడను. రామదాసు సాధకుడైయుండుటచేతను, కబీరుఁడు సిద్ధుఁడై రామదాసునకు గురువుగ నుండుటచేతను, రఘురాముఁడు బావిలోఁబడిన సందర్భమునందు కబీరుఁడు ప్రవేశించి పుత్రమోహ జనితంబగు నుదరశోకంబును సహింపఁజాలక దేహవిస్మృతయైన కమలాంబకు ధర్మోపదేశం బొనర్చు భాగము నెక్కువగ హిందీభాషలో వ్రాసినాఁడను. తానీషా మహమ్మదీయుఁడైనను మతపక్షపాతము లేక యన్యమత సహిష్ణుతగల ధర్మప్రభువగుటచేత రామ రహీములొక్కఁడే దేవుఁడని యెఱింగి భగవంతుని ధ్యానించిన భాగమెక్కువగ హిందూస్తాని భాషలో నెలకొల్పితిని. తానీషా సితారాలకును కమలాసితారాలకును కొన్నిసందర్భములయందు సంభాషణపాటలు(Dialogue Songs) బొందించితిని. ఎక్కువగ కుదిర్చిన పాటలన్నియు గ్రంథమందేయాయాస్థలములయందు వ్రాసినాఁడను. ఇట్లు,

ధ. గోపాలాచార్యులు.

# రా ధా కృ ష్ణ.

(గ్రంథకర్త:—పానుగంటి లక్ష్మీనరసింహరావుగారు.)

ఇదియొక చక్కని భక్తిరసప్రధానమైన నాటకము. శ్రీకృష్ణుని యందుగల యపారమైనభక్తినిగూడ నిశ్చలమైనభక్తి రాధ యెన్నిరీతుల నేవిధముగ బ్రదర్శించినదో యిందు గాంచనగును. రాధకును శ్రీకృష్ణునకును గల ప్రేమ జీవాత్మకును పరమాత్మకునుగల యాధ్యాత్మిక సంబంధమువంటిది గాదని యీనాటకరాజము బోధించును. ప్రకృతి సుకుమారిణియై మహాసుందరియైన రాధ—సంతత శ్రీకృష్ణ సంకీర్తనామృతధారలనే యాహారపానీయములుగ గ్రోలిన రాధ—సర్వకాలసర్వావస్థలయందు లోకనాథు నిరంతరాయదర్శన నిత్యమహానంద పరవశయైన రాధ--మృదుమధురమకరందపరిపూర్ణవికసితపుష్పలతలయందు-నిర్మల జలపూర్ణవాహినీతరంగములయందు—గిరినిర్ఝరములయందు--పర్వతమాలికలయందు— శ్యామలకోమలతరులతాగ్రములయందు—దిగంతములయందు—నందు—నిందు—నననేల ? ప్రకృతియందంతటను శ్రీకృష్ణుని మనోహరదివ్యరూపమును గాంచిన రాధ—తనయంత సుందరస్వరూపిణియగు కాంత యీభూలోకమున నెందును లేదని గర్వపడుచుండెడి సత్యభామను, కాలకూటానల ప్రతిమానవిషజ్వాలా భూయిష్ఠమగు కాళీయనాగేంద్రుని ఫణాగ్రమున దాండవమాడిన నటశిఖామణిని తనచీరచెఱగుకొంగున ముడివేసికొని లోబరచుకొంటినని విఱ్ఱవీగు సత్యభామను యేరీతిగ గర్వోపశాంతిజేసి, భక్తురాలిగ జేసినదో యీనాటకమున, ముద్దులొలుకు చక్కని పదములచే వర్ణింపబడినది. సత్యభామ అసూయాజనితగర్వరూపకములైన పల్కులు—చేష్టలు—శ్రీకృష్ణుని నిజస్వరూపము—శారదుని నిరంతర హాస్యప్రసంగములు చదివితీరవలయును. ఈనాటక మాంధ్రదేశమున పేరొందిన నాటకసంఘములచే ననేకపట్టణముల ననేకపర్యాయములు ప్రదర్శింపబడియెను.

వెల 0—12—0.

వలయువారు :—కురుకూరి సుబ్బారావు,సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.

శ్రీరస్తు.

# రామదాసు నాటకము.

ప్రస్తావన.

## నాంది

సూత్ర—

శా. శ్రీరామా! సుగుణాభిరామ! కమలాసీమంతినీవల్లభా!
పారాశర్యసుసేవ్య! కౌస్తుభధరా! పద్మాక్ష! పీతాంబరా!
సారానందనిదాన! శేషశయనా! సర్వేశ! దీనావనా!
కారుణ్యాలయ! భద్రశైలనిలయా! కాపాడు భక్తాళులన్.

[ప్రవేశము - నటుఁడు.]

నటుఁడు—

గీ. రామనవమి నేఁడు రఘువీరుజననంబు
భువిని దనరినట్టిపుణ్యదినము
రామచంద్రుమహిమఁ బ్రకటించు నాటక
ఖేలనం బొనర్పఁబోలు నార్య!

ఆర్యా! శ్రీరామజననపుణ్యదినంబున నారాఘవుని కథను నాటకంబుగఁ బ్రకటించి యానందము నొందుదము.

సూత్ర—మిత్రమా! శ్రీమన్నారాయణుఁడు లక్ష్మీసమేతుఁడై యాదిశేషుఁడు దను సేవింపఁగా రామలక్ష్మణ సీతావతారంబులఁ బుడమిపైఁ బ్రసిద్ధినొంది భద్రాచలంబును భూవైకుంఠంబుఁ గావించి యందు వెలుగొందుచుండుఁగదా!

శా. శ్రీకాంతామణి జానకీరమణియై సేవింపఁగా, శేషుఁడున్
సాకల్యంబగు పాదభక్తి గరిమన్ సౌమిత్రియై కొల్వఁగా,

లోకారాధ్యుఁడు మేరుపుత్త్రిడు సుశీలుం డైనయాభద్రునుపై
వైకుంఠంబని నిల్చు దాశరథి నే వాలాయ మర్చించెదన్.

ఈపుణ్యదినంబున శ్రీభద్రాచల రామదాసుచరిత్ర నాటకమును బ్రదర్శింతము.

నటు—కానిమ్ము. ఆర్యా! రామదాసుభూమిక తురుష్కఫక్కిగ నుండవలయుఁగదా?

సూత్ర—(నవ్వుచు) రామదాసు తురుష్కుఁడని యెవరు చెప్పిరి?

నటు—అయిన నతని దేకులము?

సూత్ర—అతఁడు నియోగి బ్రాహ్మణుఁడు. ఆమహనీయుని తొలుతటినామము గోపన్న.

నటు—రాజద్రవ్యము నపహరించిన రామదాసు మహనీయుఁ డెట్లాయెను?

సూత్ర—రామదా సపరాధి యనుట మిక్కిలి పొరబాటని యీనాటకంబున విశదమగును.

నటు—ఇదియేమి? కథయా? పురాణమా? చరిత్రమా?

సూత్ర—ఇది చరిత్ర. 200 సంవత్సరముల క్రిందట గోలకొండ రాజ్యపు దొర తానీషా (లేక, అభూహసన్ కుతుబ్ షా) యను జనపాలునికాలమందు జరిగినది. భగవంతుఁడు భక్తరక్షకుఁ డని యెల్లరకుఁ బ్రత్యక్షమైన వృత్తాంతము.

(వెనుకనుండి గానమువినఁబడును, పాట—రాఘువధరణీసుతాధవ)

సూత్ర—ఓహో! శ్రీభద్రాచలమునకు భక్తులరుగుచున్నారు. మనము బోవుదమురమ్ము. (నిష్క్రమింతురు.)

ఇది ప్రస్తావన.

---

శ్రీరస్తు.

# రామదాసు

## ప్రథమాంకము.

### ప్రథమరంగము—శ్రీభద్రాచలముబాట.

[ప్రవేశము - బ్రాహ్మణ సమూహము, భజనసేయుచు]

(అనుబంధము. 1.)

[ప్రవేశము - గోపన్న.]

గోపన్న—మిత్రులారా! ఈపయన మెచ్చటికి?

బ్రాహ్మ—శ్రీ భద్రగిరి సీతారాముల యుత్సవంబునకుఁ బోవుచున్నాము.

గోపన్న—సంతోషము! నేను నదియే తలఁచుచుంటిని. వెడలుదము రండు.

బ్రాహ్మ—గోపన్నగారూ! ఇట్లే యున్న దున్నట్లు కట్టుబట్టలతో వచ్చెదరా?

గోపన్న—రాకేమి?

బ్రాహ్మ—ఇంటికిఁబోయి ప్రయాణమునకు వలసిన వస్తువులను సేకరించుకొని తల్లికిఁజెప్పి రండు. మేము తిన్నగఁ బోవుచుందుము.

గోపన్న—అయ్యా! శ్రీరామపాదసేవకుఁగదా మనము పోవునది. ఇందునకు సన్నాహమేల? ఒకరియాజ్ఞయేల?

సీ. భద్రాద్రిరఘురామభజనకు జనుచుండ
బంధుమిత్రులయాజ్ఞఁ బడయనేల?

జీవాత్మ భరియింప శ్రీవత్సధరుఁ డుండ
దనువుపై మనకింత తమక మేల ?
హరినామకీర్తనాహారపానములుండ
నాఁకలిదప్పుల కడలనేల ?
సాయుజ్యమును జెంద సాధనతతులుండ
సంసారవహ్నిలో సమయనేల ?
గీ. భక్తిమీఱఁ గీర్తింపుఁడీ భద్రదాసుఁ
జేతులారఁ బూజింపుఁడీ శ్రీనివాసుఁ
జిత్తమార సేవింపుఁడీ చిద్విలాసుఁ
రాణ యొప్పారఁ జేయుఁడీ రామభజన.

(అనుబంధము. 2.)

(అందఱు రామభజన మొనర్చుచు నిష్క్రమింతురు.)

[దాసరి ప్రవేశము-గరుడకంబము, చేగంట, శంఖములతో.]

దాసరి—భద్రాచలరామచంద్రా ! గోవింద.
భద్రగిరివాసా ! గోవింద.
మంచికొండవాఁడా ! గోవింద.
మేలుగట్టుఱేఁడా ! గోవింద.
గొనబుగుబ్బలిసామీ ! గోవింద.

(అనుబంధము. 3.)

భద్రాచలవాసా రామచంద్రా ! గోవింద.

[ప్రవేశము - పొట్టపెరిగిన తురక.]

తురక—అరే ! ఘోయిందా ! ఈఖొండాకిదగ్రి ఘోయిందా ఘోయిందా కర్కె_అల్లాయిస్తే నీకు పైసా యెవఁడు యిస్తాఁడుబే ?

దాసరి—సలాంసాహేబూ దౌలత్ మియా!

తురక—అలైకుం సలాం.

దాసరి—సాహేబు! నిన్నుసూడక సేనాదినాలాయె బాగున్నావా?

తురక—ఖుదాకీ దయాసే ఖైరియత్ వుండాను.

దాసరి—ఏయూరికిఁబోయి యుంటివి? ఏమికథ?

తురక—అరేభాయి! నాకీ గోల్కొండలో ఫసంద్ నౌక్రి సిక్కింది. మూడువఖ్తులు ఖానా - రెండువఖ్తులు సోనా-నడ్మనడ్మ షరాబ్ పీనా - సెవులుతెరిస్తే గానా - ధోరసూస్తేనానా - యెప్పటికీజనానా - లేనా - దేనా - ఆనా - జానా - అంధా నాపైన. అందేక్ యిట్లున్నా.

దాసరి—నీకు బొజ్జ పెరిగినదే.

తురక—అరేఅల్లా! ఊర్కేబే నీనజర్ తాకీని. పేట్ పెర్గాలా గిర్గాలా నాకీ ఫాటహాంజెపాకి అందు కీతబ్లా యీడపెట్టుకుండా (అని కడుపుచూపుచు) హానాతో ఆయిస్తాసూడి.

(అనిపాడును.)

(అనుబంధము 4.)

దాసరి—బలేబలే! సాహేబు! బహుబాగా పాడుతావే.

తురక—అరే ఘోయిందా! గాంలో యేమిఖబర్? నీవు యీకొం డాకు కైకు వస్సిండావు?

దాసరి—దౌలత్ మియా! ఈకొండమహాత్మ్యం నిండావున్నది. మన వూళ్ళో తమ్మలదమ్మక్క ఉండలే?

తురక—అరే! ఉస్కే దాన్కి మేమ్ ధమ్ధమా సెప్పుతుంటి.

దాసరి——ఆదమ్మక్కకు యీకొండపైన దేవుండ్లు చిక్కినారు. రామన్న లచ్మన్న సీతమ్మ మూడుపుట్టుశిలలు చిక్కినవి. ఏటామేట యీగుట్టపైని రామస్వామికి యెంతపరష, యెంతసంబరము ! నేఁడు శ్రీరామనవమిజాతర. ఏకంగా జనం కలుస్తారు. నేను అక్కడకే పోతూవున్నాను.

తురక——అయిసా! అయితే మిఠాయిదుకాణం తినేకి నేనుభీ వస్తా. నీవు పోతుండు.

(నిష్క్రమింతురు.)

[ప్రవేశము-కొండలురెడ్లు-దమ్మక్క కోలలతో భజనసేయుచు.]

(అనుబంధము 5.)

1 రెడ్డి——ఓయి మొకిరెడ్డి! గంగిరెడ్డి! పెద్దారెడ్డి! నిలవండి నిలవండి. మామూలుతప్పి పోతున్నారే?

2 రెడ్డి——ఏమి మామూలోయి ?

3 రెడ్డి——ఈదమ్మక్కమ్మగారికి మొక్కకుండా కొండయెట్లా యెక్కుతావోయి ?

4 రెడ్డి——అవునోయి తప్పామె.

అందఱు——(దమ్మక్కమ్మకు మ్రొక్కి నుతింతురు.)

(అనుబంధము 6.)

(నిష్క్రమింతురు.)

[తెరనెత్తగా - భద్రగిరి - సీతారామలక్ష్మణులు - జాతరజనులు. ప్రవేశము - కబీర్ దాసు.]

(కబీర్ రామకీర్తనగావించుచు కొండనెక్కుచుండును.)

(అనుబంధము. 7.)

ధర్మకర్త—ఓయీ! ఫకీరుసాహేబు! నీవిచ్చటికి రాఁగూడదు. మా దేవునిపాటఁ బాడఁగూడదు.

కబీరు—స్వామీ! రామనామకీర్తన మీచెవులకంత కఠినమైయున్నదా?

ధర్మ—అవును. నీనోటనుండి వెడలురామకీర్తన నాచెవులకు గఠినమే!

కబీరు—ఏల?

ధర్మ—నీవు మహమ్మదీయుఁడవు.

కబీరు—మహమ్మదీయులకు దేవుఁడు లేడా?

ధర్మ—ఉండవచ్చును. మీదేవుఁడు మీకు. మాదేవుఁడు మాకు.

కబీ—స్వామీ! దేవు లెందఱున్నారు?

ధర్మ—ఆయధికప్రసంగము నీకేల? నీకులమువారు మాదేవునిదగ్గ ఱకు రాఁగూడదు.

కబీ—స్వామీ! మీదేవుని దేకులము?

ధర్మ—ఇదియధికమైన యధికప్రసంగము. నీవురాకుము, పోమ్మావల.

కబీ—స్వామీ। నే నెవరు? మీరెవరు? తెలియునా?

ధర్మ—బాగుగఁదెలియును. నీవు ఫకీరుఁడవు. నేను గుడిధర్మకర్తను. నీవింక నెక్కువగ మాటలాడుచుఁ బోవకుండిన నిన్నీచోట నుండి గెంటించెదను.

కబీ—(నవ్వుచు) ఆరాముఁ డేమిచేసినను సంతోషమే. (అని పాడు చుండును.

ధర్మ—ఏమయ్యా! మేము చెప్పునది నీకు హాస్యమాయెనా? నీపాటఁ జాలించి దూరముగఁబొమ్ము.

కబీ—(పాడుచుండును.)

ధర్మ—(కోపమున కబీరును సమీపించును.)

గోప—(అడ్డగించి) అయ్యా! ఇతఁడు సత్పురుషుఁడుగ నున్నాఁడు. ఆతురపడకుము. నే నున్నాఁడను. నీ వుత్సవకార్యములఁ జూడఁ బొమ్ము.

ధర్మ—గోపన్నగారూ! ఈతురుష్కునిమాత్రము ముందుకు రానీయకుఁడు. భద్రము.

(నిష్క్రమించును.)

కబీ—(పాడుచుండును.)

(అనుబంధము 8.)

గోప—(కబీరుధ్యానము విని యానందించి నమస్కరించును.)

కబీ—(నవ్వి.)

మహారాజ్! ఆప్ హైఁ బ్రహమన్ హైహుం ముసల్మాన్ ఇస్‌తర హేఁసే ఆఫ్ ముఝ్కు తస్లింకర్నా మునాసిబ్ నహిహై?

గోపన్న-హజ్రత్! ఆప్కు కామిల్ తౌర్‌సే యిన్‌హకీకత్‌కీ వాకిఫియత్ హై. కె అల్లాకెమఖ్లూక్ కే రూహేఁ జిత్నేహైఁ వోతమాం యేక్‌హీజాత్‌సే నిక్లేహైఁ అవుర్ ఖుదాకెషఁక్లేఁహైఁ జోఫరక్ హై. యేజలానే జిసంమే, అవుర్ బులానే యిసంమేహై. మేరా తస్లీం ఆప్కే బాతిన్‌మేహైసో ఖుదాకు పహుంచాయాహుం

మహారాజ! మీరు బ్రాహ్మణులు. నేను దురుష్కుఁడను. మీరు నాకు నమస్కార మొనర్చుట యుక్తముగాదు.

అయ్యా! లోకమున నుండు జీవాత్మలన్నియుభేదరహితములైన దైవస్వరూపములనుమాటమీకుఁ దెలిసినదే కదా! భేదముండునది యీనశించు దేహమందును బిలుచుపేరునందుననే కదా! నానమస్కారము నీయంతరంగమున నుండు భగవంతునకు సమర్పించి యున్నాఁడను.

ఉ. చెందవు జాతిభేదముల జీవము లెంచను బ్రహ్మతేజముల్
బొందడిదేహములొ్వరయుఁ బెక్కుకులంబులుఁ బుట్టుకల్ మృతుల్
చందగుముక్తిఁ గాంచదగుచంద మెఱుంగని మందబుద్ధులే
కొందలపాటు నొందెదరు కొంచెపు గొప్పకులంబు లెంచుచున్.

కబీ—భాయ్! మేరాబాత్‌కా మే ఖుదాకైసా రహ్‌సకాహై?

గోపన్న—జనాబ్! యేకౌల్‌హై ఖాస్‌ఖుదాకా.

"హంసే హుఆ, పైదాయిష్,
హర్ యెక్ యిన్‌సాన్.
సంఝ్‌హూ, నహీ, కిసీకు మైదోసు
యా దుష్మన్.
హోతాహుం మైనేక్ జాహీద్‌కా బాత్‌కా నిషిన్.
హోతాహై, వోభీ హామారాబాత్‌కా నిషిన్.
యే కలాంనాకిస్ హోగాక్యా.

కబీరు—భాయ్! ఆప్కా సుఖన్ సున్‌కర్ ముఝ్కునిహాయత్ మసర్రత్ హాసిల్ హుయీ. చంద్ సవాలాత్ ఆప్సేకర్నేకా మేరామన్షాహై.

గోపన్న—ఆయ్‌నేక్ బఖ్త్! హంపర్ జాహిర్ హైకె. ఆప్ఆలిం. యెముత్తక్ హై, లేకిన్ ఆప్కేసవాల్కుహాత్ ఉల్ యిమ్కాన్ జవాబ్ దేతాహుం

అయ్యా! నాహృదయమందు భగవంతు డెట్లుండును?

మహాత్మా! ఈమాట భగవంతుఁడే చెప్పియున్నాఁడు.

"మానవులను నేను సృష్టించియున్నాను. వారియందు నాకుఁ బ్రియుఁడు నప్రియుఁడు లేఁడు భక్తితో నన్ను భజించువాఁడు నాయందున్నాఁడు. నేనును వానియందున్నాఁడను." ఈవాక్యము వ్యర్థమగునా?

అయ్యా! నీమాటలకు మిగుల సంతసించితిని. కొన్ని విషయములఁ గూర్చి నిన్నుఁ బ్రశ్నింపనిచ్ఛయించుచున్నాఁడను.

సత్పురుషా! నీవుసర్వవేత్తవగుట నేనెఱుంగుదును. అయిన నీవడుగు ప్రశ్నలకు నాకుఁ దెలిసినవఱకుఁ బ్రత్యుత్తరమిచ్చెదను.

కబీరు—సునోభాయ్:

"ఆలంకామాలిక్ హై
యేక్ హీఖుదా:
ఆఖోంకునహీనజర్
ఆతాఖుదా,
నాపైదానాఫానీ
హోతాఖుదా!
నమాలుంక్యాహోత్మెరహ్తాఖుదా
కొయీనదేఖాషక్ లెఖుదాకా
బయాన్‌తో కర్తాబహుత్
తహ్రేకా, హోత్సెబనాతా
హజారోంమూరత్
ధాత్ మేదిఖాతా
దేవ్ తాసూరతె.

పరమేష్వర్‌కు పద్ధర్‌వోధాత్
మే బేషుమార్ సూరతేసమాకర్
పరస్త్రీ కాయ రఖ్ నా దురుఃత్
హైక్యా?

గోపన్న—అయ్' ఖునాషినాస్
యేకజ్‌ఫహం ఆదంజాద్ కా
బాత్‌సుఁ లేజియె.

"ఖుదా హైయి కేలాఖాలిక్
జహాఁ
సధా హైనిరాలఖిల్‌కత్
జహాఁ
ఖరీ హై ఖుదా సేహర్‌జాయ్
జహాన్

అయ్యా!

శా. శ్రీకాంతుం డొకఁడై యగో
చరుఁడునై సేవింపగాఁ గోర నే
యా కారంబునుగానరాక మొగి
నాద్యంతంబు లేకాలమున్
లేకుండుఁ గద యట్టిచోట మను
జుల్ లీలార్థులై భ్రాంతులై
యాకాంక్షఁ బరమాత్మువిగ్రహ
ము నాహా! పూజఁ గావింతురే?

భగవంతుఁడొక్కఁడుఁగ నగోచర
రుఁడుగను నిరాకారుడుగ నుండ
గా విగ్రహంబుల నిర్మించి వానికిఁ
బేరులు పెట్టి యవి దైవములని
పూజించుట యుక్తమా?

మహాపురుషా! న్యూనజ్ఞానుఁడ
నైన నానుడి యాలింపుము.

మ. అనఘా! యీశ్వరుఁడెల్ల వస్తు
వులలో నందంబుగానుండఁడే
కననీవిశ్వమువాసుదేవమయమై
కైసేతఁ నొందుంగదా
వనజాక్షుం డనయమ్ము విగ్రహా
ములఁ వర్తించునం చెప్పుడుఁ

దరీహై ఖుదాకు హర్ షాయ్ జహాఁ.

ఆబీద్ కు మెఖియార్ హై కె చాహే ఆస్మాఁ కీతరఫ్ దసుబస్తా హోకర్ ఖడే, చాహే కోయీ చీజ్ కాసామ్నే హాత్ జోడే, బహార్ హాల్ పర్ వర్దిగార్ పర్ ఖయాల్ వాతవక్కుల్ యిబాదత్ కరే.

కబీరు—బహుత్ ఠీక్ హై. భాయ్ ఇఁ పహాడ్ పర్ జమాహువా సో మహాజనోఁనే ఆపస్ మే. ఆలాజాత్, అదనాజాత్, బ్రహ్మన్, గైర్ బ్రహ్మఁ, కాఖ యాలాత్ కర్తేర్హు గడై హైనా: యిస్కా బిచార్ క్యా హోగా ?

గోపన్న—ఆయ్! సత్ పురుష్! యేర్ఘుగ్డా; దున్యావీ దగాబాజీలోగ్, బర్పాకియాహో బద్ మామిలా హై, కుల్ యిఁ సామెదోహిహిస్సే హోతేహై ఏక్ హిస్సా గ్యానీ, దూస్రా అగ్యానీ, బ్రంహకామానీ హై గ్యాఁ, ఇన్ లియే గ్యానీకుకహా బ్రహ్మన్ సజ్జఁ ఖుదాపరస్త్ అగ్యానీకుకహ్నా గైర్ బ్రిహ్మఁ దుర్జఁ ఖుద్ పరస్త్ లిహాజా ఆప్కు యిన్ జాయ్ పర్ రాకా సోహోమూరఖ్ లోగ్ సబ్ గైర్ బ్రహ్మఁ హై.

మనసారంగను సల్పుపూజ లవి
యే మానాథుపాదార్చనల్.

పేరు లెన్ని పెట్టినఁ బరమాత్మ యొక్కఁడె. అతఁడు సర్వమయుఁడు. విశ్వమంతయు హరిమయము. అతఁడు విశ్వమయుఁడు. అతఁడు లేనిపదార్థమే లేదు. కావున భక్తులు తమతమ యిష్టముల కొలఁది దైవభావముతో సేవస్తువునైనఁ బూజింపవచ్చును.

మంచిమాట. ఈగిరిపైన నిందఱు వచ్చియున్నారుకదా ! వీరిలో బ్రాహ్మణ శూద్రవినాదముకలదు. ఇందుల విచార మెట్టి దగునో చెప్పుము.

సత్పురుషా ! ఈవిచార మైహికాపేక్షగల దాంభికులప్రచారముగనున్నది. మానవులలో జ్ఞానులనియు నజ్ఞానులనియు రెండే తెగలు గలవు. జ్ఞానులు, సజ్జనులును పరార్థులునగుదురు. అజ్ఞానులు దుర్జనులును స్వార్థులు నగుదురు. మిమ్ముల నిందడగించి నిలపినవారు మూర్ఖులగుదురు.

కబీరు—ఆఫ్రీ! సద్ ఆఫ్రీ! భాయ్ ఆప్కా జేబాయిష్ జబాఁసె మైముతక్ దిల్ ఖుస్ బన్ గయా అబ్ తో యేక్ హీఆఖర్ సవాల్ తుంపర్ బాకీహై. కె ఇఁసాఁ యిఁదునియాసెరిహాయి యాసె మోక్ష్ పానేకా ఆసాన్ రస్తాకోన్సాహై ?

గోపన్న—మాల్వీసాహెబ్ ! ఇస్కా సాఫ్ జవాబ్ దేనేకు ముఝ్కుజురాత్ నహీఆతి, కెంకే ఇస్కేబారేమే గ్యానీనే అనేక్ మార్ గ్ బతాతేహై చంద్ ఫర్ మా తేజప్ తప్ యజ్ఞా యాత్రా సేమోక్ష్ మిల్తాహై మాలుంన హీహై, కెయిస్ మే కౌఁ ఆసాఁ హై లిహాజాఆప్ బరాహ్మిహీ ర్ బానీ, యేషుబా, దూర్ క ర్కే ముఝుఖ్కా నజాత్కా సడక్ పర్ ఛోడ్నాచాహియె.

కబీరు—భాయ్ మైవొతొ్నాదానిష్ మంద్ నహీహుం మగర్ తుమారె మానింద్ ఖుదాపరస్తో స్సెజోతాలీం పాయా వోబయాఁ కర్తాహుం.

"నహిం లేగిమోక్ష్ జప్ తప్ వోధ్యాఁసె

ఉత్తమవచనము; నాయనా ! నీమాటలకు నాకు మిగుల నానంద ముప్పతిల్లినది. మఱియొక విషయ మమాత్రము నిన్నడిగెదను. మోక్షమునొంద నపేక్షించుప్రాణికిఁ బరమ సులభోపాయ మేది?

పండితోత్తమా ! ఈప్రశ్నకు సరియైన యుత్తరమొసంగ నాకుఁ గొంకగుచున్నది. యజ్ఞహోమ జపతపోనుష్ఠానాదిమార్గంబులెన్నియో యున్నట్లార్యులు నుడివియున్నారు. వీనిలో మిక్కిలి సులభమార్గమేదియో వచింప నావశముగాకయున్నది. మీరే యీసంశయముబాపి నాకు నుపదేశకర్తలై నన్ను గృతార్థుఁజేయఁ బ్రార్థించెదను.

నాయనా! నేనంత తెలిసినవాఁడనుగాను. అయిన నీబోటి భాగవత శ్రేష్ఠుల యుపదేశంబును బట్టి నేఁజెప్పెదను.

గీ. మొగిసి జపయజ్ఞముల సేయ ముక్తిలేదు.

నహిమిలేగిమోక్ష్ నదీవా
సమందర్ కె స్నాన్ సె
మురాద్ హైపహుంచ్నేకా పర
మాత్మకాచరన్
ముర్ షిద్ హైబరానేకా రాం
చందర్ కాభజన్.

జోషఖ్స్ ముస్తకిల్ అవుర్
పాకీజాదిల్సే రాంకా సితాయిష్
కరేగా వో బిలారోక్ షితాబ్ సే
నజాత్కా ముహాసిల్ హోగా

మురిసి వ్రతనిష్ఠలను సల్ప
ముక్తిలేదు
మొనసి తీర్థాల మునిగిన
ముక్తి లేదు
భక్తితో రాముని భజింప
ముక్తిలేదు.

మానవుఁడు దేహాభిమానంబుల వదలి నిశ్చలచిత్తంబునహరికీర్తనఁ జేయునట్టి నిర్మలభక్తియే ముక్తికి బహుసులభపథము.

గోపన్న—(కబీరునకు నమస్కరించి చేతులు జోడించి)

సీ. వరపుణ్యమూర్తి! నీపరిపూర్ణ హరిభక్తి
పొగడొందఁ దగు నెందు జగమునందు
నినువంటి విమలాత్ముఁ గనుగొంటి నాభాగ్య
ముదయించె కొద దించె ముదము నించె
గురువర్య! నీపాద పరిచర్య లొనరించి
కడుఁ బ్రీతిఁ బహురీతిఁ బడయనైతి
శ్రీరామనామంబు గారాముతో నెంచు
వినుతింతుఁ బ్రణుతింతు నినుఁ దలంతు

గీ. సుచితమంత్రంబు లభియించె యోగిచంద్ర!
విమలదైవంబు నెఱిఁగితి విమలతేజ!
సుఖము దీపించునిధి యబ్బె సుజనవంద్య!
నీదయాదృష్టి ననుఁ గాచె నిర్మలాత్మ!

(అని నమస్కరించును.)

కబీరు—నాయనా! శ్రీరామమంత్రమహిమ యెంతని వినుతింతును?

సీ. శ్రీరామమంత్రంబు చిత్తోపదేశంబు
భవభీతిహరణంబు పావనంబు
రఘువీరమంత్రంబు రమణీయకైవల్య
మార్గప్రదీపంబు మానితంబు
జానకీపతిమంత్ర మానిక యగుభక్తి
కారణంబు విషాదవారణంబు
తారకమంత్రంబు తామససంఘాత
భంజనంబు మునీంద్రరంజనంబు

గీ. పవనపుత్త్రవిభీషణుల్ భద్రశబరి
భరతసౌమిత్రి వాల్మీకి భవవిధాతృ
సురవియచ్చరతాపసవరులు మున్ను
మదిఁ బఠించిన యాదివ్యమంత్ర మిదియె.

గోప—దేవా! ఈదివ్యమంత్రము నాకు నుపదేశించి నాకు గురుఁడ వైతివి. నీయాజ్ఞచొప్పున నేను బ్రవర్తించెదను. శ్రీరాముల సన్నిధికి నీవెంట నన్నుదోడ్కొని పొమ్ము.

కబీ—నాయనా! రాములయిష్ట మెట్లున్నదో యారీతిగనే చేయుదము రమ్ము. పోవుదము.

(ఇరువురును పాడుచు నడిచెదరు.)

ధర్మ—(కోపమున నెదురుగవచ్చి) ఇదియేమి గోపన్న? ఈతురకను దూరముగఁ దరుముటమాని వెంటబెట్టుకొని యెగురులాడుచు రాములగుడికి వచ్చుచున్నావు?

గోప—అయ్యా! ఇతఁడు సామాన్యుఁడు కాఁడు. పరమభాగవతుఁడు.

ధర్మ—గోపన్న ! నీయట్టివాఁడు తురుష్కునిఁ బరమభాగవతుఁడన్న మేము నవ్వవలయునా? యేడ్వవలయునా? నీ పీతనిమాని యీవల రమ్ము.

గోప—అయ్యా ! నాగురువులవారిని నే నెట్లు విడుతును ?

ధర్మ—రామరామ! (అనిచెవులుమూసికొని) అయ్యా! నీవై కోరికోరి తురకలలోఁ గలసిపోయిన నీతలవ్రాతకు మేమేమిచేయుదుము ?

గోప—ఊరక తెలియక మాటలాడకుము. జ్ఞానమించుక కలిగి సంభాషించితివేని నీవాడినమాట తప్పని నీనోటనే పలికించెదను.

ధర్మ—అయ్యా ! నీవు సగము తురకవైతివి. నీజ్ఞాన మెప్పుడో పోయినది. రామోత్సవమున కాలస్యము సేయకుము. నీ వాసాహేబును వదలఁజాలకుంటివేని మీరిరువురును దూరముగఁ బొండు.

గోప—రామభక్తులు శ్రీరాముల సన్నిధికిఁ బోవుచుండ నెవ్వ రడ్డగింపఁగలరు ?

ధర్మ—అయ్యా ! నీవు సద్బ్రాహ్మణుఁడ వనుకొనియుంటిమి. ఇట్లు చెడిపోవుట తెలియదాయె. రామమండప మపరిశుద్ధముచేసి యుత్సవము నిలుపనెంచితివా ? కానిమ్ము చూతము. (దాసరినిజూచి) ఓరీ దాసరీ! ఆప్రదేశమందల్లావుద్దీన్ తహాశ్శీల్ దారుఁ డున్నాఁడు. ఇచ్చట హిందువులకును మహమ్మదీయులకును గొప్పకలహము జరుగుచున్నదనిచెప్పి తత్క్షణము వారినిఁ బిలుచుకొనిరమ్ము.

దాసరి—చిత్తము.

(అని నిష్క్రమించును.)

గోప—బ్రాహ్మణా ! అబద్ధపుపలుకులాడవచ్చునా ?

ధర్మ—కల్లలాడకున్న, దాస్యముచేయకున్న నిప్పటికాలమునఁ గూడు పుట్టునేమయ్యా ? (కబీరునుచూచి) ఓయీ ఫకీరు ! బుద్ధికలిగి

రాజసేవకులు వచ్చులోపలఁ దొలఁగిపొమ్ము. లేకున్న నీకర్ధచంద్ర ప్రయోగమగును.

కబీ—ఆరాముఁ డేమిచేసినను పరమానందము.

(అనుబంధము. 9.)

(అని పాడును.)

[ప్రవేశము—తహాశ్శీల్దారుఁడు.

తహ—క్యా గడ్‌బడ్ హై; (ఏమి యలబలము?)

ధర్మ—సర్కార్ ! యీఫకీరుసాహేబు మాదేవునిదగ్గఱకు వచ్చుచున్నాఁడు. ఎంతచెప్పినను పోఁడు.

గోప—అయ్యా! వీరు మూర్ఖులు. ఇతఁడు మహనీయుఁడు. దైవభక్తుఁడు వచ్చిన నేమియు దోషములేదు.

తహ—ఇఁకేమయ్యా ! మీకులమువాఁడు యే హరకత్ లేదనుచున్నాఁడు.

ధర్మ—జనాబ్ ! ఇతఁడు మాకులములోలేఁడు. ఈఫకీరుసాహేబేమొ మోసముచేసి యితనికులముఁ బోగొట్టినాఁడు.

తహ—అయ్యా ! కులము వచ్చిన దెట్లు ? పోయినదెట్లు ?

ధర్మ—సర్కార్ ! ఇట్టిప్రశ్నలకు మేము ప్రత్యుత్తరమీయరాదు. ఈదేవులు హిందువులవి. బ్రాహ్మణులు పూజింతురు. వీరిదగ్గఱకు—కోపము చేయకుఁడు—మీజాతివారు రాఁగూడదు.

తహ—అట్లైన నాతో మీకేమిపని ?

ధర్మ—అయ్యా ! మాకుఁ బనిలేదు; కాని తానీషారాజుగారు మీకు పనియిచ్చియున్నారు. మతవిషయములలో హిందువులకును మహమ్మదీయులకును కలహములు రాకుండ చక్కపెట్టునది మీపనియని నే ననుకొన్నాఁడను. మీరు వెళ్ళిపోయినయెడల మే ముత్సవమునునిలిపి నవాబుగారియొద్దకే పోయెదము.

తహ—అయ్యా! నీవు బడాబద్ - (మాటమ్రింగి, కబీరుదాసునిజూచి)

హజరత్ ఆప్కా తారీఫ్ క్యా హై! ఇస్ జాయ్‌పర్ ఆప్ క్యాకర్నా చాహ్తే హై?

అయ్యా! మీరెవరు? ఈస్థలమునం దేమి చేయదలచి యున్నారు?

కబీరు—జనాబ్! మేరానాం హై కబీర్. మైహూం గరీబ్ ఫకీర్. ఇస్ పహాడ్ పర్ రాంచందర్ కా యిబాదత్ కర్నే కా గరజ్ సే ఆయాహూం.

అయ్యా! నా పేరు కబీరు. నేను బీదపకీరుఁడను. ఈగిరిపైన శ్రీరామచంద్రుని సేవఁ జేయు కోరికచే వచ్చియున్నాఁడను.

త—యారబ్! యే క్యా గజబ్ హై జనాబెఆలీ. ఆప్కా జబాన్ సే హిందోరాంబుత్ పరసీఅల్ఫా జేఁ నికల్ రహే హై. ఆప్ కౌంమే ముసల్మాన్ తో హైనా? ఆప్కా పయిదాయిష్ కా క్యా తారీఫ్ హై?

అయ్యో దైవమా! ఇది యేమి యవాచ్యమయ్యా! నీనోట హిందువుల విగ్రహారాధనఁ జేయు వాక్కులు నుడువుచున్నావు. నీవు కులమున మహమ్మదీయుఁడవు కదా నీపుట్టుక తెఱఁగెయ్యది?

కబీరు—జనాబ్! మై కోయీ కిసం కా కౌంమే షరీక్ నహీహూం, న ముసల్మాన్ హూం, న హిందు, న అవుర్ కోయీ జాత్కా. మగర్ మైహూం పరమాత్మ రాంచందర్ కా బందగాన్ కా బందా.

అయ్యా! నేనేకులమందును జేరినవాఁడను గాను. మహమ్మదీయుఁడను గాను. హిందువుఁడను గాను. మఱియే జాతివాఁడను గాను. నేను పరమాత్మయగు శ్రీరాముని దాసానుదాసుఁడ.

ధర్మ—అయ్యా! చూచితివా? మీకులములోఁబుట్టి కులధర్మములు మాని హిందువుల వెక్కిరించుచున్నాఁడు. మాకు మిక్కిలి యాలస్యమగుచున్నది. శీఘ్రమున నితనిఁ దొలగింపుఁడు.

తహ—హజరత్! ఆప్కా హాలత్ సోచ్ కర్ ముఝ్కు తాజుబ్ మాలుం హోతాహై. మైనే కుచ్ నహీకహ్‌సక్తాహుం. మైహుం సర్కారీములాజమ్. అవుర్ కాయిదేకా పాబంద్. మజ్బూరీసే అరజ్ కర్తాహుం కేఆప్ హిందోకాయుబాదత్ మే దఖల్ దేనా మునాసిబ్ నహీహై. మెహర్‌బానీకర్కే రివాజ్ కె ఖిలాఫ్ నకీజియే. అవుర్ యహాఁసే నికల్ జాయిమె.

అయ్యా! మీచందము చూడ వింతగనున్నది. నేనేమియు నుడువజాలను. నేనురాజకీయయుద్యోగిని. చట్టములకుఁ గట్టుపడియుండువాఁడను. కావున విధిలేక మీతో మనవిజేయునదేమన్న, హిందువుల యుత్సవములలో మీరు ప్రవేశించుట యుక్తముగాదు. దయయుంచి యీవిరోధకార్యమువదలి యిచ్చటనుండి వెడలిపొండు.

కబీరు—క్యా? మెహుకుం రాంచందర్ కాహై? మై వున్కా పరస్తి ఛోడ్ కర్ జానాక్యా?

ఇది శ్రీరాముల యాజ్ఞయా? నే నారాముని సేవమాని పోవలయునా?

తహ—కిసీకాహుకుం సమఝ్‌లీయే-అప్‌తో జానాచాహియే.

ఎవ్వరియాజ్ఞమైన నేమి? ఇచ్చటినుండి పోనేవలయును.

కబీరు—అచ్ఛా-మైజావుంగా. మగర్ రామచందర్కు నఛోడుంగ.

మంచిది! నేఁబోయెదను; కాని రామచంద్రుని విడువను.

(అనుబంధము. 10) (అని పాడును.)

(కబీరు గుట్టదగుచుండును.. విగ్రహము లదృశ్యము లగును.)

అందఱు—(భయవిస్మయముల నభినయించి) హా! హా! ఇదేమి దుష్ప్రాప్తి? దేవులెచ్చటికిఁబోయిరి. ఏమి చేయవలయు?

గోప—(ఒక చోట నిలిచి ధ్యానము సేయుచుండును.)

ధర్మ—ఆఫకీరుఁడై౦ద్రజాలికుఁడు. ఇది కనుకట్టువిద్య. అయ్యా! మహేంద్రశాస్త్రిలు! ఈ జాలవిద్యకు నెదురుమంత్రము ప్రయోగించి యాఫకీరుమాయఁ బోఁగొట్టుఁడు.

మహేంద్ర—చిత్తము. (అని మంత్రించును, యత్నించును, నిష్ఫలమగును.

దమ్మ—బాపలారా ! నాపుణ్యావశంబున లభించిన శ్రీరాముని మీరు పోఁగొట్టితిరి. నాదేవునిఁ జూపకున్న మీకు గొప్ప యనర్థము గలుగును.

ధర్మ—అమ్మా! దమ్మక్కా! నీదేవుఁ డెచ్చటికి పోవును ? తురుష్కుని మైల తగిలినందున నిట్లయినది. కొంచెము తాళుము. శుద్ధమంత్రజలంబులతోఁ బ్రత్యక్షమగును. బ్రాహ్మణుల ప్రభావము నీ వింక నెఱుంగఁగలవు. (అని పుణ్యాహవాచనము నొనర్చును. నిష్ఫలమగును.)

రెడ్డి—(ధర్మకర్తనుగూర్చి) అయ్యా ! ఇంత చేటునకు నీవే కారణము. నిన్నూరక విడువము. మూటఁగట్టి బావిలోఁ బాఱవైచెదము.

దమ్మ—(దుఃఖమున) అయ్యో ! నాజాతర పాతరలోబడెను. నా యుత్సవము మునిఁగెను. నాదేవుఁడు పోయెను. ఓయయ్యవారూ ! నీవు నాదేవుని జూపకున్న నే నిచ్చటనే ప్రాణములు విడిచెదను.

ధర్మ—ఇంతటియనర్థమునకు హేతు వదిగో ! ఆబకధ్యానముఁ జేయుచుండు గోపన్న. అతఁడు మహమ్మదీయునకు శిష్యుఁడైనందున శ్రీరాముఁ డత్యాగ్రహముఁ జెంది తిరోధానమై యున్నాఁడు. ఇతనికిఁ దగిన ప్రాయశ్చిత్తముఁ జేయింపుఁడు. దేవుఁ డెట్లుకానరాకుండునో చూచెదను ?

రెడ్డి—ఈమాట నిజమై యుండవచ్చును. (గోపన్నతో) అయ్యా! మా దేవుని నీవు చూపెదవా ? లేక నీకుఁ బ్రాయశ్చిత్తముఁ జేయవలయునా ?

గోప—నేఁ జెప్పినట్లు మీరు చేసెదరా ?

రెడ్డి—మా రాముఁడు వచ్చునట్లయిన నీవేమిచెప్పిన నది చేయుదుము.

గోప—అట్లయిన నీబ్రాహ్మణుని (ధర్మకర్తనుజూపి) గొనిపోయి యీ రామభక్తుఁడగు కబీరుదాసునిపాదములపైన వైచి మీరంద అతనిని వేఁడుకొని యిచ్చటికిఁ బిలుచుకొని రండు. మీ రాముఁడు తానే వచ్చును.

రెడ్డి—ఈపని యవశ్యకము చేసెదము. (ధర్మకర్తను జూచి) ఓబాఁప నయ్యా ! ముందునకు నడువుము.

ధర్మ—నేను రాను.

రెడ్డి—రావా ? (ఇతరులఁజూచి) ఏమి చూచెదరు? ఈపాఱుని త్రాళ్ళ తోఁ బిగఁగట్టుఁడు. (అని కట్ట నుంకింతురు.)

ధర్మ—తాళుఁడు. తాళుఁడు. మీరుచెప్పినట్లు నేఁ జేసెదను. అప్పటికిని రాముఁడు ప్రత్యక్షము గాకున్న నెట్లు ?

గోప—అప్పుడు నేను మీరు విధించు ప్రాయశ్చిత్తమునకు లోఁబడెదను.

ధర్మ—అయినఁ గానిండు.

(అందఱు బోయి కబీరునిపాదములపైన ధర్మకర్తను వైతురు.)

రెడ్డి—(కబీరునిఁజూచి) మహాస్వామీ ! ఈపాఱునిపాపము మమ్మునం దఱినిఁ జుట్టుకొని యున్నది. మీరు గుట్టదిగిన వెంటనే దేవుఁ డదృశ్యుఁడాయెను. అనుగ్రహించి యేతెంచి శ్రీరామోత్స వము యథావిధిగ జరుగునట్లు ప్రసాదింపుఁడు.

కబీ—నేను తురకవాఁడనే! మీదేవునియొద్ద కెట్లురాఁగలను ?

రెడ్డి—స్వామీ ! మాతప్పులన్నియు క్షమింపుఁడు. మీరు రాకున్న మిమ్ము నెత్తుకొనిపోయి రామమండపమున నునిచి మీకే యుత్సవ మొనరింతుము.

కబీ—(నవ్వి) మహానుభావులారా! రాముఁ డదృశ్యుఁడాయెనని పలుకుచున్నారే ? మీ రెంత వెఱ్ఱివారు? రాముఁడన్నను, దేవుఁడన్నను, అల్లాయన్నను, సకలమానవులకీశుఁడైన పరమాత్మకదా. ఆ దేవుని మనము చూడనే లేదే ? మనము చూడనివాఁ డెప్పటికిని యదృశ్యుఁడె. భ్రాతలమైన మనయందఱికి నొక్కఁడే దేవుఁడు. మనయందఱిజాతి యొక్కటే మానవజాతి. మనయందఱి గమ్యస్థాన మొక్కటే, మోక్షము. మనమందఱము నడువవలసిన మార్గ మొక్కటే, జ్ఞానమార్గము. ఇట్లుండ, మనలో మనము యెక్కువతక్కువ తరగతులు, స్పృశ్యాస్పృశ్యతెగలు భేదములు, ఖేదములు, వాదములుఁ గల్పించుకొని, మాదేవుఁడు, మీదేవుఁడు, మాకులము, మీకులము, అని కాకులవలె కలహించుచు వ్యాకుల మొందుచున్నామే మన కేల నీయాకులము? సిద్ధపడుఁడు. మనమందఱము జేరి పరమాత్మునిభజన యొనరింతము. ఇందునకు శ్రీరాముఁడు కరుణించి మీకోరికతీర మీకుఁ గోచరుఁడగును.

(అనుబంధము 11.)

అందఱు—భజించుచు నడుచుచుండ విగ్రహములు కనబడుచుండును.

(కరతాళ ధ్వనులతో రామకీర్తనఁ జేయుదురు.)

ధర్మ—(కబీరునకు నమస్కరించి) స్వామీ ! జ్ఞానశూన్యుఁడనై జాతి భేదము లెంచి మహాపరాధినైతిని. మీకిదె నమస్కరించెదను. క్షమింపుఁడు.

(రామునకు మంగళహారతి సేయుదురు.)

---

శ్రీరస్తు.

# రామదాసు

## ద్వితీయాంకము.

### ప్రథమరంగము.

ప్రదేశము:—గోలకొండపురము, రాజవీధి.

(ప్రవేశము-చాటింపువాఁడు.)

చాటింపు—జనులారా! మంచివార్త. (ఖుష్ఖబర్) వినుఁడు. మన దొరవారగు తానీషాబాదుషాగారు హుకుంనామా జారీచేసి యందఱికిఁ దెలియులాగునఁ జాటింప నియమించియున్నారు. వినుఁడు వినుఁడు, "రాజుగారు సర్వమతస్థులను సమదృష్టితోఁ జూచునట్టి ప్రభువనుటకును, హిందూమహమ్మదీయులలో మన స్తాపకలహములు జరుగనీయని జనపాలుఁడనుటకును దృష్టాంతముగ విద్యావంతులగు 'అక్కన్నపండిత్' గారిని మంత్రిస్థానమందు నియమించియున్నారు. నేఁడు రాజమందిరమున నుత్సవము జరిపి యక్కన్నగారికి గౌరవము చేయఁబడును."

ఈరాజాజ్ఞ యందఱికిఁ బ్రకటింపఁబడినది.

[ప్రవేశము-పీతాంబరుఁడు-చంద్రశేఖరుఁడు.]

పీతాం—సాహేబు! అక్కన్నమంత్రిగారికూఁతురు వివాహ మెన్నఁడు?

చాటింపు—మీ రెవ్వరయ్యా?

శతా—మేము "శ్రీహరిశంకరమారుతి"మతమువారము. అక్కన్నగారి గురుపీఠమువారలము.

చాటిం—మంత్రిగారియింటియందుఁ బెండ్లి యిఁక నైదు దినములకు జరుగును.

"బరకత్ హో, దివాన్ అక్కన్న కాషార్,
బర్ ఖుర్ ద్ హో, పాక్ బాదుషాకా, జార్,
మునాదీకియా, ఖుష్ ఖబర్, యేగులాం,
మురాద్ బరాయీ సబ్ కు సలాం సలాం.

(నిష్క్రమించును.)

పీతాం—చంద్రశేఖరం! మనమతముశిష్యుఁడు మంత్రిపదవికివచ్చెను. ఇంక నతనికి ధనము కుప్పలు కుప్పలు. ఇదే సమయమున యుక్తిఁ బన్ని మనము నొకటి రెండు కుప్పలు నూడ్చుకొని యూరికిఁ బోవుదము.

చంద్ర—ఆహా! అవశ్యము కానిమ్ము. రెండు చీఁపురుఁగట్టలనిత్తునా?

పీతా—నీకు హాస్యమైనది. నేను కార్యసాధన మొనరింతును. తొలుత జవళియంగడికిఁ బోదము రమ్ము.

చంద్ర—ఎందుకు?

పీతాం—ఇది నెల్లూరు, బందరు కాదు, గోలకొండ. మహమ్మదీయ రాజ్యము. వస్త్రభూషణములు లేకున్న వివాహమందిరము నకుఁబోయి యెంత శంఖధ్వనిఁజేసినను తలవాకిటనుండియే గొంతుబట్టి త్రోసెదరు.

చంద్ర—పెండ్లింటియందు శంఖధ్వానముఁ జేసిన నాపని తప్పకకాగలదు.

పీతాం—నీహాస్య మట్లుండనిమ్ము. అంగడికి వచ్చెదవా లేదా?

చంద్ర—వస్త్రములఁ గొనుటకుఁ ద్రవ్యమేది?

పీతాం——మఠముసొత్తులఁ దాఁకట్టు పెట్టి యుడుపులఁ గొందము.

చంద్ర——తాకట్టుపెట్టి యుడుపులను మనముకొన నావశ్యకమే లేదు.

పీతాం——ఎందుకు ?

చంద్ర——తాకట్టుపెట్టినఁ జేకట్లు, కాలికట్లు, చల్లడములు, సంగీలు, పెండ్లిండ్లు, నత్తగారియిల్లు, నివన్నియు రాజభటులే మనకుఁ జేకూర్చెదరు.

పీతాం——(కోపమున) నామాటలన్నియు నీకు హాస్యము లాయెఁగా ? మంచిది. ఒకవేళ నే నక్కన్నవలన ద్రవ్యము లాగుకొన్న నీవందులో భాగము నడుగవుకదా ?

చంద్ర——నీతో హాస్యములాడినమాత్రాననే రాఁదగినవరుమానము వర్జింతునా ?

పీతాం——నన్నుఁ బరిహసించినవానికి భాగము నిచ్చెదనా ? ఎన్నటికి నీయను.

చంద్ర——సగ మియ్యకున్న పాతికైన నిమ్ము.

పీతాం——అట్లేకానిమ్ము. నేను సంపాదించినది యొకలక్ష. అందులో పాతిక పాదలక్ష. (ర, ల, యోరభేదః) కావున నీపాలికివచ్చునది పాదరక్ష. ఇదిగో! చేకొనుము. (అని పాదరక్ష నెత్తును.)

చంద్ర——(పరుగెత్తును.)

పీతాం——(వెంటఁ బరుగెత్తును.)

(తెరదిగును.)

(అంతఃపురమున సితారాబేగం చదువుచు వ్రాయుచుండును.)

సితారా—(ఒక కాగితముఁ జేతఁగొని) ఆహా! ఈచిట్టికాకిత మీపొత్తమున నెట్లు వచ్చెను? ఓహో! యిది మాదిలారా వ్రాసుకొన్న పాట. ఎంతమనోజ్ఞముగ నున్నది? నేను పాడి చూచెదను. (అని పాడును.)

(అనుబంధము 12.)

ఈ నీతిసాగరగ్రంథమున నెట్టియుత్తమవిషయము లున్నవి? లోకమునఁ బురుషుఁడు గాని, స్త్రీగాని, విద్య నేరవకున్న, వారు భూమి యందు నిష్ప్రయోజకులై యుందురు. విద్యావిహీనతవలన నడవడికలు చెడును. కుటుంబము కీడొందును. ఐశ్వర్యసుఖంబులు నశించును. సంతోషమంతరించును. జ్ఞానము శూన్యమగును. అన్నివిషయములఁ గుశలము నొసఁగక చెఱుపే చేకూరును. అదియునుఁ గాక, పురుషుఁ డెట్టినేర్పరి యైనను నతనిగృహిణి చదువునేర్చినచదువురాలు గాదేని యతని చాతుర్యసౌజన్యసాహసంబు లన్నియు వ్యర్థము లైపోవును.

చ. ఇలఁబురుషుండు శాస్త్రముల నెంతటినేర్పరియైననేమి? పెం
పలరిన నీతి సాహసములందిననేమి? సువిద్య లేశము
న్నలవడనట్టి మందమతియా సతి భార్యగ నబ్బెనేని యా
నెలత నశింపఁజేయుఁ బతినేర్పుల నీతుల సాహసంబులన్.

నాప్రాణనాథుఁ డన్యజాతులయం దసూయమాని, యితరమతస్థుల భాషల నలవరించి జ్ఞానసంపూజ్యతఁ జెందినకారణముననే కదా; సర్వజనప్రియుఁడై గౌరవముఁబొరసి, ధర్మరీతి రాజ్యముఁ బరిపాలించుచున్నాఁడు.

[ప్రవేశము—దిలారా.]

దిలారా—(వచ్చి నిలుచును.)

సితారా—కుమారీ! యేమి యప్పుడే వచ్చితివి? కమాల్‌బీబీ నేఁడు పాటలను జెప్పలేదా?

దిలారా—నేనే పాటలు వలదంటిని. ఎన్ని పాటలు నేర్చిన నేమిప్రయోజనము? నాకింకఁ బాటలే వలదు.

సితారా—అదేలమ్మ?

దిలారా—నాజతను బాడుచున్న కమలకుఁ బెండ్లియగుచున్నది. నాకులేదు. ఇంకెందుకు పాటలు?

సితారా—(నవ్వుచు) అమ్మాయీ! పాటలు నేర్చునది పెండ్లికొఱకేనా?

దిలారా—ఇంకెందుకు మఱి? నేర్చినపాటలన్ని నాపెండ్లిలోఁ బాడవలెనని కమాల్‌బీబీ చెప్పినది.

సితారా—అట్లేకాని, ఇంకను బాగుగఁ బాటలఁ నేర్చుకొనుము. చదువులు నేర్చుకొనుము. నీకుఁ బెండ్లిసేసెదను.

దిలారా—ఊఁ! నాకుఁ గమలతోపాటు పెండ్లికావలయును.

సితారా—(నవ్వి) పెండ్లికి మగఁడు దొరకవలయును కదమ్మ!

దిలారా—ఓ! నాకప్పుడే మగఁడు దొఱికినాడు. తెత్తునా?

సితారా—ఏమి తెచ్చెదవే?

దిలారా—చూడుము (అని లోనికిఁబోయి యొకగొప్పమగబొమ్మను దెచ్చియుంచి) వీఁడుగో! నామగఁడు. బాగుగలేఁడా?

సితారా—వీఁడెక్కడ దొరకెనమ్మ?

దిలారా—గమాల్ బీబీ, నాతోఁ బది యష్రఫీ (వరహాలు)లిప్పించుకొని యీమగనిఁ దెచ్చియిచ్చినది.

సితారా—ఇంకనేమి? పాటలు బాగుగ నేర్చుకొనుచు నీమగని యెదుటఁ బాడుచుండుము.

దిలారా—ఆఁ. అటుకాదు. వీనికి నాకుఁ బెండ్లి సేయవలయును.

సితారా—ఈమగని నేను దేలేదే ? తెచ్చినవారే పెండ్లిచేయవలెను.

దిలారా—దానికేమమ్మ ! నీవే పది అష్రఫీ లంగడికిఁబంపి మంచి క్రొత్తమగనిని దెప్పింపుము. వీఁడప్పుడే పాతవాఁడైయున్నాఁడు.

సితారా—పెండ్లి యెందుకుఁ గావలయునమ్మ ?

దిలారా—పెండ్లియయిన మంచిమంచిసొమ్ములు, చీరలు దండిగ నాకు నిచ్చెదరు. అవియన్నియు నాపెట్టెలోనే పెట్టుకొనవచ్చును. ఢిల్లీనుండి 'గులాబ్' అక్క వచ్చును. బిజాపూరునుండి 'సికందర్' మామవచ్చును. ఇల్లేయూహారివారలు గుంపులుగుంపులుగ వచ్చెదరు. బగ్గీలు, గుఱ్ఱాలు, నేనుఁగులు, రథములు, దండుతాయిఫాలు, గవయ్యాలు, రోషినీలు, జల్సాలు, నాతష్ బాజీలు, అబ్బబ్బ ! యెన్ని తమాషాలు ? అమ్మా ! యిన్నివినోదములు జరుగునని నీకుఁ దెలిసియుఁ బెండ్లి యెందుకనుచున్నావే. ఎంత పిచ్చిదానవే నీవు.

సితారా—అవునమ్మ ! నేను బిచ్చిదాననే ! ఏదీ నీమగని నడుగుము? నిన్ను బెండ్లిసేసికొనునేమొ ?

దిలారా—వీనికి మాటలు రావు.

సితారా—మాటలురాని మగనికెట్లు పెండ్లిసేయవలయునమ్మ ?

దిలారా—ఏమొ పోవమ్మ. నాకుఁ బెండ్లిసేయకున్న నేను భోజనము జేయను.

సితారా—నీ వింకను చిన్నదానవమ్మ. ఇప్పుడే పెండ్లిసేయరాదు.

దిలారా—నావంటి చిన్నవారి కెందఱికో పెండ్లియగుచున్నదే. కమల చిన్నది కాదేమి ?

[ప్రవేశము - కమల.]

కమల—దిలారా ! మాయమ్మ వచ్చుచున్నది.

దిలారా—(కోపమున దలవంచుకొని మాటలాడదు.)

సితారా—కమలా! నీతల్లిని రమ్మనుము.

[ప్రవేశము-శ్యామలాంబ మంగళద్రవ్యములతో.]

సితారా—(లేచి యెదురేగి) శ్యామలాంబ! రమ్ము కూర్చుండుము.

శ్యామ—(వినయమున గూర్చుండును.)

సితారా—మనకమలకు వివాహముఁ జేసెదరా?

శ్యామ—మహారాణీ! అట్లే యార్యులు నిశ్చయించియున్నారు. (అని మంగళద్రవ్యములతబుకు సమర్పించును.)

సితారా—అమ్మా! ఇచ్చోట నామహారాణిబిరుదును వచింపకుము. ఇది దర్బారుకాదు. మనము సమానులము. ఊరక నన్ను సితారా! యనిపిలచిన నాకు సమాధానముగ నుండును.

శ్యామ—తల్లీ! సర్వజనప్రియుఁడై జగద్వంద్యుఁడైన తానీషాభూకాంతుని ధర్మపత్నివై తరుణీసంఘములో సత్కీర్తిగాంచిన నీవు, స్త్రీలందఱు సమానులనుట వింతమాట యగునా?

సితారా—అమ్మా! అది యుండనీ, మా దిలారాకు నాపైఁ గోపము వచ్చియున్నది.

శ్యామ—రాజపత్నీ! నీకుమారికకోపమునకుఁ గారణ మేమని యడుగవచ్చునా?

సితారా—కమలకు నీవు పెండ్లిసేయుచున్నావు. ఆమెకు నేను బెండ్లి సేయనని కోపము.

శ్యామ—అవును నిజమె. ఈకుమారికిఁ ద్వరలోఁ బెండ్లిసేయవచ్చునే! చిన్నిబాలయపేక్ష నేల తీర్పరాదు?

సితారా—(నవ్వుచు) అమ్మా! నామాటకుఁ గోపపడకుము. మా దిలారా కెంత జ్ఞానమున్నదో నీకు నంతియే యున్నది.

దిలారా—(చిఱ్ఱునలేచి, కమలచేయిపట్టుకొని) కమలా! మాయమ్మ నాకుఁ బెండ్లిసేయుదాఁక నీవును బెండ్లి చేసికొనకుము. మీ యింటికే పోకుము. మాయింటనే యుండుము. రమ్మ. (అని లాగుచు లోపలికిఁ గొనిపోవును.)

(కమలా-దిలారా నిష్క్రమింతురు.)

సితారా—మీకమల కిప్పుడెంత వయస్సు?

శ్యామ—ఎనిమిదివత్సరములు.

సితారా—మీరేల యిట్టిబాలికావివాహమునకై త్వరపడితిరి?

శ్యామ—అమ్మా! మేము వృద్ధాచారంబునకుఁ గట్టువడి ప్రవర్తించుచున్నారము.

సితారా—ఈపద్ధతి బాలికలకు క్షేమకరముకాదు. దీనిని దప్పింపవలయును. స్త్రీ భూమిపైన జన్మించెనేని యామెకు నబల యను నామముతోడనె జన్మించుచున్నది. చిన్నతనముననే పడుచునకుఁ బెండ్లిసేసి యామెమెడకు మగఁడను నుత్తిత్రాడును గట్టి తల్లిదండ్రులే తరుణుల జ్ఞానబలంబులను హీనంబులు గావించుచున్నారు. బాలికావివాహము మిక్కిలి యపాయకరము.

సీ. తనవివాహము వేదధర్మసంగత మంచు
బరికింపనోపునే బాలకన్య?
సొమ్ములు చీరలే సొగసులు గులుకులే
భావించు మదిలోన బాలకన్య?
సతిధర్మమును నేర్పు సద్విద్యదనరకఁ
బత్నియై మెలఁగునే బాలకన్య?
జతవారితోనాడి సరిగమలను పాడుఁ
బతినిఁ బూజింపునే బాలకన్య?

గీ. చేయిదప్పుచు నాథుండు జేటుఁగనిన
బాలపత్ని వేగమగునే బాలవిధవ ?
పతిమనసునకు విసుకైనఁ బతితయగునె
వసుధ గాజుబొమ్మనుబోలు బాలకన్య.

పెద్దలగువారు, దేశకాల వ్యవహారస్థితులనుఁ బరికించి, బాలకన్యాపరిణ యాచారంబును బరిత్యజింపనే వలయును గాని, ముష్కరంబగు మూర్ఖ తను పరిగ్రహింపరాదు. ఈ యాచారము నిందాప్రసారము. నోరెఱుం గని నారీసంతతుల సౌఖ్యసంహార మీయాచారము. వనితావితానము లకుఁ గన్నవారే కరుణావిహీనులై విధించు నరకశిక్షాప్రచార మీ యాచారము. మానవతులకు జ్ఞానదీపము గానరాకుండ నిరోధించెడి నిబిడాంధకారమీయాచారము. సతీసంతానంబు లట్లుండ మానవజాతినే యున్నతస్థితికి రానీయక నడ్డగించు ఖడ్గప్రహార మీయాచారము. ఇట్టి ఘోరమైన దురాచారమును బరిహరింపక మనవంటివారు ప్రాలుమాలి నఁ దరుణీసంఘమునకు క్షేమ మెట్లుకలుగును ? శ్యామలాంబ ! నన్ను క్షమింపుము. నేను నీకుమాఱియుద్వాహమునకు రాఁజాలను.

శ్యామ—దేవీ ! నీవాక్యములు క్షేమదాయకములు. సజ్జనసమ్మత ములు, లోకవిదితములు. ఇంక ముందు బాలికావివాహము లను నేను జేయననియు, నట్టివివాహములకుఁ బోవననియు, ప్రతినసేసితిని. దీనినొక్కటిని మన్నింపుము.

సితారా—అయిన సంతోషము. దిలారా ! యిటురమ్ము.

దిలారా—(ప్రక్కనుండి) నేనేరాను.

సితారా—నీ వీపాటఁబాడిన నీకుఁ బెండ్లిసేసెదను, రమ్ము.

దిలారా—(వచ్చి) ఏపాటఁబాడవలయును ?

సితారా—ఇదిగో (అని కాగితమిచ్చును.)

దిలారా—(పాడును)

(యవనికపడును.)

---

## ద్వితీయాంకము - తృతీయరంగము.

[ప్రవేశము-సిద్ధాంతి-చంద్రశేఖరము.]

చంద్ర—సిద్ధాంతీ ! నన్ను బరిహసించినందు కక్కన్నగారిచే నీకు మంగళహారతి బాగుగ నాయెనా ?

సిద్ధాం—ఓరీ ! జ్యేష్ఠాదేవికి జ్యేష్ఠపుత్రుఁడవైన నిన్ను వెంటఁబెట్టుకొని వచ్చినది నాదే తప్పిదము. నీవు కలిపురుషుఁడవని నాకు దెలియకపోయెను.

చంద్ర—నేను కలిపురుషుఁడనైన నీవు నలమహారాజువైతివి. ఇంకేమి తక్కువ ? నెత్తినగుడ్డవేసికొని యడవిదారిఁ బట్టుము.

సిద్ధాం—కానిమ్ము ! ఇంతటితో నక్కన్న నూరక విడుతునా ?

చంద్ర—నీ వతని నేమి చేయఁగలవు ?

సిద్ధాం—తే పతనికూఁతురిపెండ్లి గాకుండ నిలిపెదను.

చంద్ర—అదెట్లు నిలిపెదవు ?

సిద్ధాం—సిద్ధాంతసామర్థ్యమున నాకన్యకు వరుఁడొక్కరుఁడును దొరకకుండఁజేసి యక్కన్న కవమానము జేకూర్చెదను. వధూవరులజాతకములను నిన్నరాత్రి చూచితిని. పట్టు బాగా చిక్కియున్నది. వియ్యంకునివెంబడి యక్కన్నయింటికిఁ బోయి సంచి లోనిపిల్లిని వెలికి విడిచెదను.

చంద్ర—సిద్ధాంతీ! వధూవరులజాతకములఁ జూచియున్నాఁడవు గాని, నీజాతకమునుగూడఁ జక్కఁగఁజూచుము. నేఁడు నీ కెటువంటి మహాయోగ మున్నదో ?

సిద్ధాం—నీ వెప్పటికిని పిటికిబేలవు. నేఁడు నాప్రతాపమును జూతువు గాక.

చంద్రి—నీప్రతాపముఁ జూతునో లేక నీసంతాపముఁజూతునో కాని, నినువంటి మహానీయులు మతములోఁ జేరియుండు కతముననే స్వాములవారిని గౌరవసన్యాసులుగను నిక్కఁపుభిక్షుకులుగను, దేశపుగ్రుమ్మరులుగను జేసి గంగిరెద్దులయాట నాడించుచున్నారు.

నీల—(లోపలనుండి ధ్వని) సిద్ధాంతిగారూ !

సిద్ధాం—నీలకంఠము పిలచుచున్నాఁడు పోయెదను.

(నిష్క్రమింతురు.)

---

(తెరయెత్తఁబడును.)

అక్కన్నమంత్రిగృహము.

[అక్కన్న-వియ్యంకుడు, గోపన్న-బ్రాహ్మణులు.]

అక్క—పురోహితులుగారూ! వివాహమునకు రేపుదయలగ్నము ప్రశస్తముగ నున్నదా ? లేక రాత్రిలగ్నము బాగున్నదా ?

పురో—సిద్ధాంతిగారు! ఈవిషయమును గుఱుచ్చుటకు మీరే సమర్థులు.

సిద్ధాం—వధూవరులజాతకముల నందిండు.

పురో—(జాతకముల నిచ్చును.)

సిద్ధాం——(జాతకములఁజూచి గణితమువేసి) మంత్రిగారూ! ఈనీలకంఠము నాకుఁ బరమమిత్రుఁడు. మీరు గొప్పవారు. మీకాగ్రహము గలుగకున్న శాస్త్రరీతిగ నిశ్చితవిషయములఁ దెలిపెదను.

అక్క——నిశ్చితమో, యనిశ్చితమొ పుస్తకములఁ జదివి గ్రహముల లెక్క చెప్పువారిమాటలకు నాకేల నాగ్రహము? వలసినది చెప్పుఁడు.

సిద్ధాం——ఈవరున కింకను మూఁడుసంవత్సరములవఱకు వివాహము కాదు. ఈకన్యకు భర్తయయినవానికి కారాగృహప్రాప్తి యగును. ఇవి తప్పనిమాటలు.

అక్క——(కోపమున) ఇవి తప్పనిమాటలా? నీలకంఠముగారూ! రేపుదయలగ్నముననే సిద్ధపడుఁడు. ఈపాఱునిసిద్ధాంతము ప్రభాతముననే భంగము కాఁగలదు.

నీల——(సంకోచమున) కుమారునకుఁ గారాగృహప్రాప్తి యగునను సిద్ధాంతివచనము విని తల్లి యేమనునో?

అక్క——మీ రీమాటల నమ్మితిరా?

నీల——నేను నమ్మకున్నను నాభార్య నమ్మును.

అక్క——అయిన నీవివాహమునకు మీరు సమ్మతింపరా?

నీల——సందేహమే తోఁచుచున్నది.

అక్క——ఆహా! యింతగ వివాహసన్నాహములనుజరిపి నగుఁబాటగు మాడ్కి లగ్నమును నిలుపుదునా? ఇది కానిపని. పురోహితా! నీవు నాకుమార్తెకి నెవ్వరినైన వరుని నిష్కర్షచేసి రేపటిలగ్నముననే కుదుర్చుము. దరిద్రుఁడైనను గులీనుఁడై విద్యావంతుఁడగువానికి నాబాలిక నిచ్చెదను.

పురో—(చేతులుత్రిప్పి) మహాప్రభూ ! ఈజ్యోతిషికునిమాట లరగడి యలో నూరంతయు వ్యాపించును. ఇది విన్నవారెవ్వరు నంగీకరింపరు.

అక్క—(ఆగ్రహమున) అయిన, రేపు నాకొమరితపరిణయము నిలుచుటయేకాక నాయమ నుద్వహించువాఁడు లేఁడనియా నీతాత్పర్యము ?

పురో—(ఊరకుండును.)

గోప—మామా ! శ్రీరాములదాసుఁడను, నీమేనల్లుఁడను, నేనుండ రేపులగ్నము నిలుచునా? నీ కవమానము గల్గునా ?

అక్క—(ఆశ్చర్య సంతోషములతో) ఏమి? గోపన్నా ! నీవు వివాహముఁ జేసికొందువా ?

గోప—మామా ! ఇదేమి వింతగఁ బ్రశ్నించెదవు ?

అక్క—నీవు భక్తిమార్గము నవలంబించి బ్రహ్మచర్యమందె ప్రవర్తింప నిశ్చయించియున్నాఁడవని తలఁచియుంటిని.

గోప—ఈమాట లెవరు సెప్పిరి ?

అక్క—నీయూరివా రెందఱోవచ్చి నీరామభక్తిని శ్లాఘించి గృహస్థుడగు వాంఛయే నీకు లేదని నుడివిరి. లేకున్న నీవెఱ్ఱివాఁడగు నీలకంఠయ్యతో వియ్యమునకు నేను యత్నించుచుందునా ?

నీల—మంత్రిగారూ ! నేనా వెఱ్ఱివాఁడను ? మీయమాత్యపదవిని, సంపత్తిని గాంచి సంసారభోగానందముల నపేక్షించి యుత్తమంబగు యత్యాశ్రమము నుపేక్షించి యిప్పుడు నీపట్టిని చేపట్టసమకట్టెఁగదా నీమేనల్లుఁడు.

గోప—అయ్యా ! నాలుగాశ్రమములలో గృహస్థాశ్రమమే శ్రేష్ఠము. ప్రాణిసందోహంబులను వాయువు బోషించువిధంబున గృహస్థుఁ

డితరాశ్రమములవారిని బోషించును. రిక్తుఁడై సన్న్యాసియై చేతఁ గాసులేని యతి, ప్రపంచమున కేమిక్షేమ మొనరింపఁగలఁడు ? కావునఁ బురుషుఁ డవశ్యము పెండ్లి చేసికొనవలయును.

నీల—సిద్ధాంతిగారు ! మీరే యీగోపన్నకు యుక్తమగు ప్రత్యుత్తర మొసంగుఁడు.

సిద్ధాం—ఇది జ్యోతిషవిషయముకాదు. నవగ్రహములు సప్తవింశతి నక్షత్రము లొక్కటియు నిందులోఁ బ్రవేశింపవు.

నీల—అక్కన్నగారు ! ఇఁక మాకు సెలవొసంగుఁడు. మాయూరికిఁ బోయెదము.

అక్క—ఛీ ! యవివేకీ ! అప్పుడే మిమ్ముల నీగోలకొండనుండి పోవ నిచ్చెదనా ? నాకుమారిపెండ్లిలో నీవు, నీభార్య, నీపుత్రుఁడు నాయింటికి వచ్చిన బంధువుల కుపచారము లొనర్పవలయును. సేవకా ! (అని పిలుచును.)

[ప్రవేశము - భటుఁడు.]

సేవక—స్వామీ ! ఏమి సెలవు ?

అక్క—ఈనీలకంఠయ్యను పీనియింటివారిని బదిలముగా నుంచుము. పురోహితా ! ఆలస్యమేల ? వివాహనిశ్చితార్థము కల్యాణ హారతియుఁ గానిమ్ము. కన్యను దోడితెమ్ము.

పురో—భాగ్యము.

(నిష్క్రమించును.)

[ప్రవేశము కన్య (కమలాంబ) మొదలగువారు.]

(వధూవరులకు, బూలహారములువేసి, హారతియెత్తుదురు.)

ద్వితీయాంకము సమాప్తము.

శ్రీరస్తు.

# రామదాసు

## తృతీయాంకము.

ప్రథమరంగము - గోపన్నయిల్లు.

రఘు—(శ్రీరాములపటము నుంచుకొని పూజకు యత్నించుచుండును.)

[ప్రవేశము - బాలకులు.]

బాలక—రఘురామా! నీ విల్లువిడిచి వెలుపలికి రా వెందుకురా?

రఘు—వెలుపటి కెందుకు రావలయును?

బాలక—ఆడుకొనుటకు.

రఘు—నే నింటిలోనే యాడుకొనుచున్నాను.

బాలక—ఇంటిలో నెవ్వరితోడ నాడుకొనియెదవురా?

రఘు—రామచంద్రునితో.

బాలక—రామచంద్రుఁ డెవఁడురా?

రఘు—వీడిగో (అని రామునిపటముఁ జూపును.)

బాలక—(చూచినవ్వి) వీనితో నెట్లాడుకొనియెదవురా?

రఘు—చూపెదను చూడుము. (పూలుదీసి పటముపైన వైచి చేతులుజోడించి నిలచి)

"శ్లో. శ్రీరామంనవరత్నకుండలధరం, శ్రీరామరక్షామణిం।
శ్రీరామంచ సహస్రభానుసదృశం, శ్రీరామచంద్రోదయం।

శ్రీరామంశ్రుతకీర్తిమాకరమహం, శ్రీరామముక్తిప్రదం ।
శ్రీరామంరఘునందనం, భయహరం శ్రీరామచంద్రంభజే ॥"

బాలక—రఘురామా! ఈయాట బాగున్నది. మాకును నేర్పుము.

రఘు—అట్లే కానిండు. ఈపూలను పటముపైనవైచి నే నుడువునట్లు చెప్పుఁడు.

బాలక—మంచిది. (పూలు పటముపైన వైతురు.)

రఘు—(రామధ్యానము నుడువును. బాలకులు నుడువుదురు.)

(అనుబంధము 13.)

[ప్రవేశము - గోపన్న - కమలాంబ].

గోపన్న-పాట-నం—14-రాగము-పూరికల్యాణి
తాళము - రూపకము.

రామచంద్ర, రవికులేంద్ర, రాజతాంగ, సత్యనికర ।
సామజారిగర్వప్రదర - శ్రీమనోహరా ॥రామ॥

1. నీరజాత పత్రనయన - శూరివంద్యశోకదమన
సారధర్మపాలసుగుణ - చారుభూషణ ॥రామ॥

బాలకులు—(గోపన్నను గాంచి భీతితోఁ బరుగెత్తుచుందురు.)

గోప—(వారించి) బాలకులారా! ఇటురండు. భయపడకుఁడు. మీ రేమైనఁ జెడుపని చేసితిరా? ఎవరినైననుఁ గొట్టితిరా? తిట్టితిరా?

బాలక—లేదు. ఏమో యూరక భయమాయెను.

గోప—ఇఁకమీఁద నిటువలె భయపడకుఁడు. మీరు చేయుచుండునది మిక్కిలి మంచిపని. ప్రతిదినమును మారఘురామునితో నిట్లె యాడుకొనుఁడు. నేనును మీకుఁ దోడుపడియెదను. ఊరిలో మీరు చూచినబాలురందఱికి నిటువంటియాటలే నేర్పుఁడు.

బాలక—అట్లే చేసెదము.

గోప—ఈయాట మొదలిడువిధము మారఘురాముఁడు చూపెను. దీనిముగింపువిధానము నేఁ జూపెదను. (హారతి వెలిగించి కమలాంబకు నందించి) కాంతామణీ! శ్రీరాములకు హారతి యొసర్చి మంగళముఁ బాడుము.

కమల—(హారతిఁజేయుచుఁబాడును.)

(అనుబంధము 15.)

(బాలురు నిష్క్రమింతురు.)

కమల—నాథా! మీరు లోకమంతయు రామమయముఁజేసి, రామశబ్దముదప్ప నితరశబ్ద మొల్లకున్నారు. కావున మీకు మీతలిదండ్రులిడిన 'గోపాల' నామము బాగుకాదని నాకుఁ దోఁచుచున్నది.

గోప—(నవ్వుచు) కాంతా! మఱియేపేరైన నీకు బాగనితోఁచును?

కబీరు—రామదాసు (అనిధ్వని, తెరప్రక్కనుండి వినఁబడును.)

గోపన్న—
కమలా— } (వైపులఁ బరికింతురు.)

[ప్రవేశము - కబీరు - నర్తనఁజేయుచు.]

(అనుబంధము 16.)

గోపన్న—
కమలా— } (కబీరునకు నమస్కరింతురు.)

కబీరు—గోపన్న! నీవధూమణినుడివినది వాస్తవము. సాకేతపురాధిపుఁడగు శ్రీసీతామనోనాథుని నీవు సంతతము భజించుచుండు

టచే నీకు 'రామదాసు' అను నామము కడుయోగ్యము. తండ్రియు గురువును సమానులు గాన నేను నీ కీనామకరణముఁ జేసితి.

ఉ. ఏమహనీయతేజుఁడు మునీంద్రనియోగము సిద్ధిఁజేసి సు
ప్రేమ చెలంగఁగన్ మునివరేణ్యవధూటి నహల్యఁ గాచి సీ
తామహిళామణిన్ హరివిధాతలు మెచ్చఁగ నుద్వహించె నా
రాముని బంక్తికంధరవిరామునిఁ గొల్వుము రామదాసువై.

రామదాసు—యోగిచంద్రా! నీయాజ్ఞ శిరసావహించి మెలఁగెదను. ఆరాముని పాదసేవకన్న నెక్కుడగు కార్యము నాకేమున్నది?

ఉ. రాముఁడె తండ్రి నాజనని రాముఁడె బంధుఁడు రామచంద్రుఁడే
రాముఁడె మిత్రుఁడున్ గురువు రాఘవుఁడే పరదైవతం బగున్
రాముఁడె నాకుదిక్కు రఘురాముఁడె రక్షకుఁ డాప్తుఁడౌను శ్రీ
రామునిపాదపద్మమె నిరంతర మొంతు మదిన్ గురూత్తమా!

మహాత్మా! ధరణీతలంబున మానవజన్మమెత్తి కర్మఫలంబులను భవించుచు సహింపఁజాలక, మరలనిట్టిజన్మము లేకుండఁ జేసికొనుసదుపాయంబు గానరాక నజ్ఞానసముద్రంబునంబడి యంధుఁడనైయుండిన నాకు నీప్రసాదముచే దివ్యజ్ఞానరత్నము లభించియుండ నారత్నమును బోఁగొట్టుకొని యవివేకుఁడ నగుదునా? శ్రీరామచరణసరోజధ్యానామృతంబును రుచిచూచినపిమ్మట మఱియు నీభవబంధములకుఁ జిక్కుపడి, దురితంబు లాచరించి మర్మరణంబునొంది దండధరపురద్వారసాన్నిధ్యదారుణ జ్వాలాజాలదందహ్యమానవైతరణీతరంగిణిలోఁ బడుటకు నభిలషింతునా? ఆహా! మాఁడనీయశ్రీవత్సలాంఛనాంచితహృదయ

మండలుండును, గమనీయమణిగణశోభాపరిపూర్ణ సారసవర్ణ మకరకుండలుండును, భాస్కరబింబ ప్రతిమానపద్మరాగరత్నప్రభాభాసమానకిరీటుండును, మోహనాకారమాధుర్యరసపూరితమృగమదతిలకోల్లసితలలాటుండును, జంద్రకోటిస్ఫురద్బింబసమానవికాసమానవదనుండును, నవ్యయరత్నకాంచనసౌభాగ్యసుఖానందసదనుండును, గమనీయకౌస్తుభమణిఖచితకంఠికాలంకృత కంధరుండును, గోమలప్రసూనవితానపరిమళమిళితవనమాలికాబంధురుండును, పూర్ణశశాంకచంద్రికాసుందరతర మందహాసుండును, శరణాగతభక్తసంతానావనలీలావిలాసుండును, యోగీంద్రమానసారవిందకర్ణికామధ్యస్థితవిలసితపాదకిసలయుండును, సహస్రకోటిప్రభాకరకిరణతుల్యదేదీప్యమానవినూత్ననవరత్నభూషణాలంకృతవైకుంఠనిలయుండు నయిన యాపరమాత్ముని శ్రీరామచంద్రుని పాదపంకజభజనము నేనెన్నటికైనను మఱతునా ?

శ్లో. "వదతువదతువాణీ రామరామేతి నిత్యం
జపతు జపతు చిత్తం రామపాదారవిందం।
నమతునమతు దేహం సంతతం రామచంద్రం
నభవతు యమతాపో జన్మజన్మాంతరేషు"

ఈనిర్మలంబగు నుపదేశంబును మైమఱచి యుందునా ?

కబీరు—కుమారా ! రామదాసు ! నీమనోదార్ఢ్యంబునకు శ్రీరాముఁడు గడుమోద మొందగలఁడు. నినువంటిహరిభక్తశేఖరులను దర్శించుచు సంచరించునది నాకు మిగుల సంతసమగు కార్యము. నే నిఁక నరిగెదను.

రామ—యోగీంద్ర! యీదాసునియాతిథ్యము స్వీకరించిపోవలయును.

కబీరు—కుమారా ! నీ విప్పుడొనర్చిన శ్రీరామసంకీర్తన నన్ను సంతుష్టుని జేసినది. మఱియేయాతిథ్యముగాని నాకు రుచింపదు.

రామ—గురుపుంగవా! నీసందర్శన మపేక్షించుచు నిన్నిదినములు వేచి యుంటిని. అది నేఁడానగూడినది. ఆర్యపద్ధతి ననుసరించి గృహస్థాశ్రమముననున్న నేను సమర్పింపఁబోవు గురుదక్షిణను గరుణామానసంబున నంగీకరింపవలయునని వేఁడెదను.

కబీరు—(యోచించి) అట్లయిన నేపదార్థమును నాకు దక్షిణగ నొసంగెదవు?

రామ—నాయొద్దనుండునది. నాకు భగవంతుఁడిచ్చినది. నీవుకోరినది. సమర్పించెదను.

కబీరు—అయిన నాకనుగుణంబగు పదార్థముఁ జెప్పెద వినుము.

కం. చోరులుగోరని నిధియై
పేరాసను జెందుఖలులు ప్రేమింపనిదై
శ్రీరాముని గారామున
నోరామా! యనుచుఁ బిలువ నో! యనవలయున్.

అట్టిపదార్థము నొసఁగుము.

రామ—(యోచించి - ఆనందించి) రఘురామా! ఇటురమ్మని. (అని పిలుచును.)

రఘు—(సమీపించును.)

రామ—ఈ యోగీంద్రులకు నమస్కరింపుము.

రఘు—(కబీరుపాదములయొద్ద మోకాళ్ళపైనఁ గూర్చుండును.)

రామ—క. రాముఁడె సృజియించెను నను
రాముఁడె కాంతను గుమారరత్నము నొసఁగెన్
రాముఁడె రక్షకుఁ డాయెను
రాముఁడె తనసేవకు రఘురామునిఁగోరెన్.

పాట - నం. 17 - మోహనరాగము. రూపకతాళము.

ఎంతపుణ్యముఁ జేసినాఁడనో ఏమిభాగ్యము ।
సంతసంబుమీరె సుతుని సత్యసంధుని వెంటఁబంపఁ॥ ఎంత॥
(కబీరుతో)

1. తామసంబికేలను రఘురాముని నీకొసంగినాఁడ ।
తాపసేంద్ర! భూరికృపను జూపుచు గాపాడితినను॥ నెంత॥
(రఘురామునితో)

2. నాకుమారమానసమున వ్యాకులమింతైనఁగనక
లోకపూజ్యుఁడైనగురుని వీఁకతోడఁగొలువఁజనుము॥ ఎంత॥

గురువర్యా! కైకొనుము, నారఘురాముని నీకు గురుదక్షిణగ నిచ్చితిని. కుమారా! నీ వీయోగీశ్వరుల వెంటఁబోయి వీరిపాదసేవఁ జేయుచుండుము.

రఘు—తండ్రీ! అట్లే చేసెదను.

కబీరు—రఘురామా! నావెంట వచ్చెదవా?

రఘు—వచ్చెదను.

కబీరు—నీతల్లియొద్ద లేకున్న నీకాఁకలియైన నేమిచేసెదవు?

రఘు—రామభజన.

కబీరు—అదెట్లు చేసెదవు నాయనా?

రఘు—(రామకీర్తన పాడును.)

(అనుబంధము 18.)

కబీరు—బళీ! కుమారా! (కమలాంబనుజూచి) అమ్మా! నీకుమారుని దోడుకొనిపోయెదను. ఏమందువు?

కమల—మహాప్రసాద మందును. ధన్యనైతినందును.

కబీరు——అమ్మా! నీవు కన్నకుమారుని నీనాథుఁడు నాకు గురుదక్షిణగ నిచ్చెను. ఈబాలుని నేను గొనిపోయినపిమ్మట నీవు పుత్త్రవియోగమునకుఁ దాళలేక సంకటపడఁగలవు. కాన నీకు సమాధానము లేకుండిన, వేఱొకదక్షిణ గొనియెదను.

కమల——యోగిచంద్రమ్మా! ప్రాపంచికసుఖములన్నియు దేహాభిమానముగలవారికేగదా! ఈదేహబంధువులు నావెంట వచ్చెదరా? లేక నాకు రక్షకులగుదురా? నానిక్కంపు బంధువులు, నాసౌఖ్యదాతలు, నాత్రాతలు వేఱున్నారు.

సీ. మునినాథ! రాముఁడు ననుఁగన్నతండ్రి యా
 కంజాక్షి జానకి కన్నతల్లి
భవవిరక్తియె నాకు భర్తయై భాసిల్లు
 పూర్ణసుజ్ఞానంబు పుత్రుఁడగును
భాగవతార్యులే భ్రాతలౌదురు నాకు
 భక్తశేఖరులెల్ల బంధుజనులు
శాంతిగుణోపేత సాధువుల్ మిత్రులు
 హరికీర్తనాపరు లాప్తవరులు

గీ. ఇట్టిజీవరక్షకులుండు టెఱిఁగియెఱిఁగి
మరల సంసారమోహంబు మఱవలేక
సుతుఁడుసుతుఁ డంచుబలుమఱు వెతలఁజెంద
పరమపదమెట్లు సమకూరు వరయతీంద్ర!

కావున యోగిచంద్ర! యీబాలుని సంతోషమున మీకు సమర్పించెదము. కొనిపొండు.

కబీరు——అమ్మా! భర్తకలిగి, జవ్వనముగలిగియున్న నీయట్టిమానవతియే సుజ్ఞానంబుచే సంసారంబును నిరసించుచుండ వయోవృద్ధుఁడనైన నే నీబాలుని జంటించుకొనిన నాకు ముక్తికలుగునా? ఈ

యుపదేశమువలన నీవునాకుగురువువైతివి. నీకు నేను గురుదక్షిణ నీయవలసినది విధియాయెను. కాన నీరఘురాముని నీకు సమర్పించుచున్నాఁడను. కైకొనుము. (అని రఘురాముని ముందుఁ బెట్టి నమస్కరించును.)

కమల——యోగీంద్రా! మహాపచారము. మీరు కడుఁబూజ్యులు. నే నెంతటిదానను?

(అనుబంధము 19.)

కబీరు——అమ్మా! జ్ఞానమహిమ మత్యద్భుతము. రామదాసు! ఇంక నీ భక్తినిష్ఠకుఁ గుందులేదు. నీవు సేకరించుచుండు భక్తియను బంగారమునంతయు నీభార్య యాభరణములు చేయును. నీకుమారుఁడు వానికి రత్నములు చెక్కును. మీకు శుభమగును. నేను పోయివచ్చెదను.

(యవనికపడును.)

---

తృతీయాంకము——ద్వితీయరంగము.

రామదాసుగృహము.

[ప్రవేశము-రామదాసు-కమలాంబ.]

రామ——(రామాయణపారాయణముఁ జేయుచుండును.)

[ప్రవేశము——బ్రాహ్మణుఁడు.]

బ్రాహ్మ——రామదాసుగారు! బ్రాహ్మణులందఱు భోజనముఁ బ్రారంభించుటకు సకలము సిద్ధమైయున్నది. మీయనుజ్ఞ నిరీక్షించుచున్నారు

రామ—ఆహా! శ్రీరాముఁడు సంతోషముగ ననుజ్ఞనిచ్చుచున్నాఁడు.
(అని బ్రాహ్మణుని బిలుచుకొని లోనికిఁబోవును. లోపలనుండి బ్రాహ్మణులసందడి.)

[ప్రవేశము భటుఁడు శీఘ్రముగ.]

భటు—అమ్మా! రామదాసుగారేరి?

[పునః ప్రవేశము-రామదాసు.]

రామ—ఏమికావలయును నాయనా?

భటు—(దుఃఖమున) స్వామీ! యేమనిచెప్పుదును?

రామ—ఉన్నది చెప్పుము.

భటు—మీకుమారుఁడు రామసింగు బావితిన్నెపైనఁ గూర్చుండి చదువుచుండి యకస్మాత్తుగ బావిలోఁబడెను. అచ్చటఁ జేరినవారు లోనికి దిగి వెదకిన నాకుమారునిపొలకువయే కానరాకున్నది. బావి లోన నేయుఱుకునఁ దగులుకొనియున్నాఁడో తెలియకున్నది.

రామ—(కన్నులుమూసికొని నిశ్చేష్టితుఁడై నిలుచును.)

కమల—హా! రఘురామా (అని దుఃఖించును.)

రామ—

శా. ఓ దైత్యాంతక! యోదయాజలనిధీ! యోపుండరీకాక్ష! యో
వైదేహీపతి! యోవిభీషణదయాపారీణ! దామోదరా!
యోదివ్యాత్మక! యోవిపన్నభరణా! యోభక్తకల్పద్రుమా!
యోదీనావన! రామభద్ర! వరదా! యోచక్రపాణీ! హరీ!

పాట - నం - 20 - రాగము - జిల్లా - తాళము - ఆది.

శ్రీరమణా! రఘురాముఁడు చేరెనె సుఖముగ నీచరణంబును
చేసెద నామది నీభజనంబు॥ శ్రీరమణా॥

1. నీరజలోచన, నెమ్మితో నీపదసేవఁ జేయగా
గోరుచువచ్చిరి సాధుజనంబులు
నారఘురాముని నన్నునుఁ గావగ
సారవిధంబుగ సంరక్షింపగ॥ శ్రీరమణా॥
(పాడి ధ్యానచిత్తుఁడై నిలచును.)

కమల——(దుఃఖమున లేచి)

సీ. బాలకా! శ్రీరాము భజనంబు నొనరించి
యింపుఁగూర్చెడివార లెవ్వరింక?
ఫలపుష్పసముదాయముల దెచ్చి పూజకై
యొలమినించెడివార లెవ్వరింక?
బాలులందఱఁ జేర్చి లీలలసమకూర్చి
యిమ్ముఁబెంచెడువార లెవ్వరింక?
ఆటపాటలచేత నానందసుఖముల
నినుమడించెడివార లెవ్వరింక?
గీ. ఇంతపాపిని నేనంచు నెఱుఁగనైతి
కఠినచిత్తుండు హరియంచుఁ గనఁగనైతి
దైవసేవాఫలమిదంచుఁ దలపనైతి
వరకుమారునిఁ గనియు నే వంధ్యనైతి॥

పాట - నం. 21 - రాగము - జిల్లాకాఫి - తాళము రూపకము.

నాసుతుండు నన్ను నేఁడు బాసిపోయెనే
ఆసలన్నియు, నాశమైనను గాసిజెందెనే
1. పాపమెంతఁ జేసితో యీ పాటుఁగాంచితి
పాపనిఁ బోకార్చి ఘోర తాపమొందితి॥ నాసుతుండు॥

రామదాసు—(కమలనూఱార్చుచు) కాంతా! బ్రాహ్మణులు భుజించు చున్నారు. మనము దుఃఖించిన ప్రమాదమగును. మనశోకా రావ మొకించుక యాభూసురులవీనులఁ బడనేని నిజమెఱిఁగి వారు భోజనము మానుదురు. చిన్నికుమారుని మరణముచే జనించిన సంకటమునకన్నను బ్రాహ్మణ సంతర్పణభంగము మిగుల వ్యాకులకరము. భవభీతికి లోఁబడి మోహాలోభములను వదలఁజాలని మనకుటిలభక్తికి శ్రీరాముఁ డెన్నటికిని బ్రసన్నుఁడు కాఁడు. ఆ రాముని యనుగ్రహము నొందఁజాలని మనుగడ నిష్ప్రయోజనము కదా! పరమాత్ముని నమ్మి యారాధించు ధీరమానసులు ఘోరమగు పుత్రమరణమును జీమకాటునకన్నఁ దక్కువగ నెంతురు. కాంతా! యీసమయమున నీకు యే సంసారబంధము గాని లేదని నిశ్చలతతో నారాముని చరణము నందు నీమానసముఁ బొందుపఱుపుము. ఇంచుకైన దుఃఖింపకుము

పాట సం. 22. రాగం ఫరజు. తాళము ఆది.

సైపుము శోకము - మానిని ।
ఓపికమనమున - నేపుగఁబూని॥ సైపుము॥

1. రాముఁడె మనరఘు - రాముఁడుకాఁడె ।
నీమదినామది - నెలకొనినాఁడే॥ సైపుము॥

2. సారమగునె యీ - తీరుతపింపక ।
ఊఱటగలుగదె - శౌరిభజింపక॥ సైపుము॥

దేవీ! శ్రీరామకైంకర్యము జరుగుచుండుసంతోష సమయంబున నెట్టిదుఃఖమైనను మనలను బాధింపఁగలదా? మన రఘురాముఁడు శ్రీరఘురాముని సన్నిధికిఁ బోయియున్నాఁడు.

మనము బావియొద్దకు బోవుదము రమ్ము. (భటునితో) నాయనా! నీవు మా యింటివెలుపలనే కూర్చుండియుండుము. బ్రాహ్మణులు భోజనము చేసినవెంటనే దక్షిణతాంబూలములకు రామసింగుబావియొద్దకు బిలుచుకొని రమ్ము. నీవు మఱేమియు వారితోఁ జెప్పకుము.

భటు—స్వామీ! అట్లే చేసెదను.

(రామదాసు-కమలాంబ-ముందుకు నడుతురు.)

కమల—(దుఃఖమున) ప్రాణనాథా! బ్రాహ్మణసంతర్పణభంగమునకు భయపడి, నామనంబున జనించినవనట నంతయు నణఁచి నిగ్రహించితిని. పుత్రమరణము స్మరించుచుమాత్రాన నావిర్భవించుదుర్భరదుఃఖమున కోర్వనోపను. నాయుల్లము తల్లడిల్లఁ జేయుచు బెల్లుగఁ బొంగి యుబికి వెల్వడి వెల్లువగట్టు శోకనదిని నిలువరింపఁజాలను. హా! కుమారా! రఘురామా! ఈనిర్భాగ్యురాలిని ఘోరదుఃఖసాగరమునఁ గ్రుంకఁజేసి విడఁద్రొక్కి వెడలఁబాఱితివే? పాపఁడా! ఆపాడుబావికడ కేల నడతెంచితివి? ఆపాపపుఁగూపమునఁ బడి, యసియాడి యఱిముఱిపడి పురికొనువెఱపుచే నెంతగ నఱచి యంగలార్చితివో! తల్లీ! యని నన్నెంత తలఁచి తలఁచి యెన్నిమార్లు పిలిచితివో! నేను పలుకకున్న నెంతనులికి పలవించితివో! ఎంతసంకటము సైరింపనోపక యెంతపరితపించితివో? (బావిని సమీపించుచు) ఓకుమారా! నాముద్దులకుఱ్ఱఁడా! నన్ను గన్నతండ్రీ! ఎందున్నాఁడవు? ఇదె నేవచ్చితి. ఓ యని పలుకుము. అమ్మా! రమ్మనుము. నావిలాపము నాలకింపుము. అయ్యో బాలకా! ఏల మాఱుపల్కవు? పిలచినతోడనే

నిండువేడుకతోఁ దెలిదమ్మిమోము సమ్మోదముదలిర్ప పండు వెన్నెలబోలినవవ్వు నివ్వటింపఁ గేలుచాచి నన్ను గౌఁగిలించి మచ్చికచే ముచ్చటించుచుంటివే? ఇపు డేల మాటలాడవు? ఏలరావు?

సీ. పున్నమనాఁటి సంపూర్ణ చంద్రునిఁబోలు
సొంపారు నీమోము చూడకున్న
పదివన్నె జిగిహొన్ను మదనపుత్తళికయై
వెలయు నీనునుమేను నలమకున్న
నిలువుటద్దంబుల నిలువైన నీచిన్ని
గొనబుచెక్కులముద్దుఁ గొనకయున్న
సుధలఁజిల్కెడుమేలు సుద్దులుదెరలు నీ
లీలానులాప మాలింపకున్న

గీ. బాల! భూమిపై నే నింక బ్రతుకఁజాల
నెమ్మి నిండార నొకసారి యమ్మ! యనుము
చిన్నపాపఁడా! ననుజూడఁ జేరరమ్మ
నాయనా! పల్కరా, రార నాకుమార!

ఓభూమ్యాకాశములారా! ఏడి నాబుడుతఁడు? ఎందున్నాఁడు నారఘురాముఁడు? అయ్యో! యింకెక్కడితనయుఁడు? ఇంకెక్కడి సుఖము? నాప్రాణమణి పోయె. నాభాగ్యనిధి పోయె. నాబంగారుస్వామి పోయె. నన్ను అమ్మా! యని పిలుచువారెవరు? నాకు ముద్దిచ్చువారెవరు? నాకు సుద్దులు చెప్పువారెవరు? నాయొద్దఁగూర్చుండి రామ పూజ నొనర్చువారెవరు? నావగపుఁ దీర్చువారెవరు? నన్నూరార్చువారెవరు? ఆహా! సుకుమారా! రూపరజితమారా! వంశైకవిస్తారా!

సౌభాగ్యసాగరా! నన్నువిడనాడితివా? నే నెట్లు సైరింతును? దుఃఖభార మెట్లు వారింతును? అసువుల నెట్లు ధరింతును? శోకాగ్ని నెట్లు హరింతును? నాపుత్రుని జీవితునిజేయువా రెవరైన లేరా? స్వర్గమున నుండు సర్వదేవతులారా! విపినములనుండు నిఖలతాపసులారా! పుడమియందు భూసురులారా! పతివ్రతలారా! పుణ్యపురుషులారా! భూరుహములారా! భూధరములారా! మృగములారా! ఖగములారా! పన్నగములారా! నాకుఁ బుత్రదాన మిండు. ఓరామచంద్రా! నారఘురాముని నాకిమ్ము. రక్షింపుము. (మూర్ఛిల్లును.)

రామ.—రామచంద్రా! నీవు నన్ను భూమిపైన జనన మొందజేసి సంసారసాగరమందు ముంచి ఘోరసంకటము లనెడు జలవిషజంతువులచేఁగఱపించి హింసపెట్టుచున్నావు. నే నేమిచేయఁగలను? నే నెంతటివాఁడను?

శా. రామా! యెంతటివాఁడ నేను? కడునిర్భాగ్యుండ దీనుండనే
వ్యామోహంబును బెంపలేదు ధరపై వాసంబునాపింప నీ
నామం బెప్పుడు నెంతు శేషశయనా! నాపాపముల్ బాపి నీ
సామీప్యంబును జేరనిచ్చి కరుణాసంప్రీతి రక్షింపవే.

(రామదాసు-కమలాంబ-బావియొద్దకుఁ బోవుదురు.)

రామ.—రామచంద్రా! నేఁడు నీజననదినంబని యానంద మొంది నిన్ను బూజించుచు, విప్రపుంగవులను భుజింపఁజేయుచు, వారికి దక్షిణాదానంబుల నొసఁగి సంతుష్టులఁజేసి నేను గృతార్థుడఁగావలయునని పరిశుద్ధసంకల్పంబునఁ గూర్చుండియుంటిని. భూసురులు భుజించుచుండఁగనె నాదేహమున కశుచిగలిగించి నాసంకల్పముపూర్ణముకాకుండ నాచేతులను గట్టివెచితివే. ధరామరుల చరణములకు నెరఁగి వారియాశీర్వాదంబులను బొరయకుండఁజేసితివే. ఇంతి

యేకాక ; అసనీసురల కాశాభంగము గావించితివే. రామచంద్రా ! యీపాపము నాయదియా? లేక నీయదియా? వీరుగో భూదేవులే తెంచిరి.

[ప్రవేశము—బ్రాహ్మణులు.]

వీరిపాదములను నేను దాఁకకుండ వారిని రిక్తహస్తులుగఁ బంపవలయునా? కాదు కాదు. నాచేతకాదు. జానకీరమణా ! నాసంకల్పము నిష్కళంకముగ సిద్ధింపఁ జేయుభారము నీయది. ఇది నీ పుట్టినదినము. ఈ సంతర్పణ నీయది. ఈ బ్రాహ్మణులు నీయతిథులు. కీర్త్యపకీర్తులు నీయవి. నేను నీదాసుఁడను. నీసేవఁ జేయునది నాకార్యము.

పాట-నం. 23-యదుకులకాంభోది రాగము-ఆది తాళము.

పరిపాలింపు మో వరదా !
పరితాపమును బాపి కరుణింపరాదా ॥పరి॥

1. పంకేజనేత్రా నీ పాదంబునాయందు ।
ప్రాంకంబుగానిల్పి పూజింతునెందు ॥పరి॥

2. నెరనమ్మినీదాసు భరియింపుమోరామ ।
శరణొందిభజియింతు భద్రగిరిధామ ॥పరి॥

[ప్రవేశము - కబీరు పాడుచు.]

పాట - నం. 24 - జంజూటి రాగము - ఆదితాళము.

రామరామవై దేహీరమణా ! రఘువం
శేశ్వర, రాక్షసహరణా ॥రామ॥

1. శ్రీధర మాధవ భూధవతిలకా ।
సీతానాయక ! చిత్తజజనకా ॥రామ॥

2. పంకజలోచన ! పక్షివాహనా !
పాపవినాశన పన్నగశయనా ॥రామ॥

3. రామచంద్ర శ్రితరక్షణశీలా! ।
రాజితశుభగుణ ! రవికులపాలా ॥రామ॥

రామ—(వినయంబున నొక్క ప్రక్క నిలచును.)

కబీరు—(రామదాసుతో) రాందాస్ ! కమలాకుమారీ క్యాకారణ్ సె మూర్ఛాపాయిహై ?

రామ—గురుమహరాజ్ ! మై సమ్‌ఝూయా కమలాకు బహుత్ దూర్. మగర్, రుక్‌నహీంసక్‌తీ మాతమ్‌యెఉదర్ అవుర్ బన్ గయీ మేరీ బచ్చేకు, బధిర్ ఇస్‌లియే, మైహుం, లాచార్ ఆప్‌హీహై హమారా పర్‌వర్.

కబీరు—(కమలాంబతో) కుమారీ కమలాంబా ! బిస్మృతీసే జాగోబే హిమ్మత్ కుత్యాగోతూకెం హోగయి అగ్యాన్ అలూదా తేరేకు యిస్‌సే క్యాపాయిదా ?

కమల—(లేచి) గురుమహరాజ్ ! మేరీ అపరాధ్‌కు క్షమాఫర్ మాయీయె జబ్ మోరీ కుమార్, హుఆ మేరీ జీవన్ బేకరార్ గ్యాన్ కాఫూర్ హయూంః బేకార్ మాత్ జరూర్.

కబీరు—కమలాంబ ! తూకహితీహూ "మై, అవుర్, మేరీ. జహాలత్ ఛాండ్‌కర్, సోచో కుమారీ హకీక్ మే తూహీ తూనహీ అవ్‌ర్ తుమ్‌హారి కుచ్‌నహీ మై మై కహ్‌నేకా అహం, ఫుజూల్ వహంహై రఘురాం తేరీ కుమార్ నహీ తూ ఉన్‌కా మాతానహీ. శరీర్ అవుర్ ఆత్మకా భేద్ బిచార్ పహ్‌ఛాన్- తరీకా సమఝ్‌కర్ ఉతార్ తేరీ పరేషాన్ జాన్‌తో తేరేపుత్త్ర్‌కా పయిదాయిష్ క్యాహై మాన్‌లో జనన్ మరణ్ కర్

మ్కా గర్ష్ట్వా గర్ దిష్ హై ఆప్, పృధ్వీ, బాయ్, తేజ్. జల్ సే, బఞతీహై యేశరీర్ ఆప్ సే ఆప్. కాల్ ప్రమాణ్ సె. హోతీ, బఞబాదె ఫరార్. జనన్ మరన్ హైకాల్ కా స్వాధీణ్. దున్యాకా మానవ్ హైకర్ మ్కీఆధీణ్-మరణ్ హై కాల్ కాచ రణ్ దాణ్-కాల్ హైకర్ మ్కాకదంబూణ్ కాల్ బస్ హోకర్ మరణ్ పాయా తుమ్ హోరీనందణ్-క్యాబన్ హోగీ. తేరీకు కర్నేకు ఉస్ కాబంధణ్-మరన్ మరణ్ కహ్తే వోహీపాంచ్ భూతోఁకు, మరణ్ కభినహీఆతీ. ఉన్ కేలంతరాత్మాకు-అనాది అనంత్ శాశ్వత్, హోతీ ఆత్మా వినాశ్, జనం, మృత్, కుచ్ భి నహీపాతీ, ఆత్మా పరమాత్మ కాల్ శుద్ధ్ హై పంచ భూత్, కర్మ్ బద్ద్ హై-ప్రపంచకా నిర్మాణ్ హోతీ. పర మాత్మకే అందర్, పదార్ థ్ కా, మకాం, హోతీ. ప్రపంచ్ కీ అందర్-ఘోరిహైఆత్మాతమామ్, చౌధాభువన్ కు జారీహై ఉస్ కా మహిమా, సాధూసంతణ్ కు బాల్, జవాణ్, వృద్ద్, గర్భస్థకు నహీఛాండ్డీ మాత్-హాలెశోక్ మే, బుద్ధిమాణ్ నహీ హోర్ తాహిమ్మత్-సుఖ్ దుఃఖ్ దోనోభి సమాన్ దుఃఖ్ మె గంగీణ్, దుఃఖ్ మెలనుమాణ్ - రహ్తాతీతూ హమెషాహైరాణ్-మిల్ తీకబ్, తేరేకు దిల్ చేణ్ ? పుత్తర్ కా ఆమద్ రఫ్ తత్, హోతీలణ్ జాన్- చిత్ మే యిత్నాతూ కాహేకుకర్ తీ బ్యసణ్? మనుష్కు, ఉమర్, కర్మ్, ధణ్, నిధణ్, బిద్యా యేసబ్, గర్భ్ మేహీ, హోగామొకరర్ - జాన్ కర్ యిస్ ధర్ మ్కు తూ నహీకర్నా యిత్నాఫికర్ మాతా క్షేత్ ర్, పితాబీజ్, కర్మ్ బారిష్, శరీర్ ఫల్, కాల్ కాట్నేవాలా అప్నా లీలాదేఖ్ నేవాలా ఆత్మారై రానిరాల జబ్ తేరీ శరీర్ సేహీ తూ నహీరఖ్ సక్ తీ సాహబత్ పతీ పుతర్ బాంధవ్ పర్ కా

హేకు అయిసీ మొహబత్ ప్రానీహై తమామ్ పానీపర్ బబులా గ్యానీహై ముదామ్ ఆనంద్ మె యిబ్ తలా జై సామగ్రీ సోనా, చాందీమెముఖ్ తలిఫ్ బన్ తనేబనాతే. కుంహార్ వో సోనార్ వైసాహీ, యేమగ్రీకా శరీర్ మే అనేక్ ప్రబర్తనే దిఖాతీ. కర్ మ్ కా ప్రచార్ లగ్ తీ త్రేరీపిచ్ఛె, కర్ మ్ భావ్ కీ మాఫిక్ ఛుట్ తీనహి హర్ గీజ్ తుఝ్కు భోక్ కియాతక్ —

తూ - సోజావ్ - వోభీ - హాంబి స్తర్

తూ - జాగో - వోభి - హుషియార్

తూ - భాగో - వోభి - హాంసఫర్ -

బేటీ ! ఏదుఃఖ్ హై, అఫ్ హీంకియాసో కర్ మ్ కా ఫల్

నాహక్, కెంఫరాతీ తేరేదిల్ మే మలాల్ - సునో మోకీ కుమారీ ! తూనేపుతర్ కా మమ్ తా మన్ మె కాయంరఖ్ కర్, మాయాప్రపంచకా, కామకుయెఖియార్ కియాతో, ఉస్ సే లగ్తిబహుత్ సే ఖట్ పట్ హైసో హాల్ సె హోజావ్ సంతుష్ట్ అమ్మాజీ ! దుఃఖ్ కు, ముఫీద్ అవుషద్ బన్ తీ ఉన్కా స్మరన్ హీనహికర్ నేమె తుఝ్కూమ క్తీనంద్ మిల్తీ, రఖ్ జావ్ రాంకా ధ్యానమె—

కమల—గురుమహారాజ్ ! మేరీరఘురాంహీ, ముఝ్కు శ్రీరాంహై బినా రఘురాం మేరీజినాబె ఆరాంహై బత్లావ్ మోకీ రఘురాంకుమిటావ్ మోరిగంకు ·

(అని కబీరుని చరణములమీాఁదఁబడి, యేడ్చును.)

కబీరు—కుమారీ! జబ్ రాంకాదర్శన్, రఘురాంకా రూప్ మే తూ చాహుంగీ వైసాహీ హోజావుంగీ ఖతంకరో తోరేగంకా యిక్ దాం ఖాతిర్ మె ధరోరాంకా కదం.

(అని ధ్యానచిత్తుఁడై పాడుచు బావిచుట్టు తిరుగును.)

పాట-నం. 25-రాగము హిం॥ భైరవి-తాళము ఆది-లేక ఏక.

మత్స్యరూపహరి మాధవ జయజయ।
కూర్మరూపగురు ధార్మిక జయజయ॥
వరహారూప! అఘ వారణ జయజయ।
నారసింహాభవ నాశన జయజయ॥
వామనరూపా! పావన జయజయ।
పరశురామరిపు హరణా జయజయ॥
రామచంద్ర ఘనశ్యామా జయజయ।
నందకృష్ణసుర వందిత జయజయ॥
బౌద్ధరూపశ్రిత బాంధవ జయజయ।
కల్కిరూపసుఖ కారణ జయజయ॥

(ఎత్తుగ పాడును.)

రామదాస సుతరూప విహారా।
రఘురామా! దేవ్ దర్శన తేరా॥

రఘు—(బావిలోనుండి పాడుచు బైలువెళ్లును.)

(అనుబంధము 26)

(పాడుచు పైకివచ్చుచు బ్రాహ్మణులకుఁ దలిదండ్రులకు నమస్కరించును.)

రామ—భూదేవోత్తములారా! మీప్రభావము పరమాద్భుతము! మీయందు శ్రీరామచంద్రునకు పరిపూర్ణానుగ్రహము కలదు. మీరు నన్ను నేఁ డుద్ధరించితిరి.

బ్రాహ్మ—రామదాసుగారూ! మామహిమ యద్భుతమైనదియు, మీ మహిమ మహితమైనదియుఁ జూచినవారు చెప్పఁగలరు. మీ నుడువులఁజూడ నాంజనేయుఁడు తనయెదుట గంతులు వేయు కప్పలను గొప్పచేసి కొనియాడినట్లున్నది.

రామ—బ్రాహ్మణోత్తములారా! మీయుపకారభరము నేఁదీర్పఁజాల ను. అయినను నాచేతనైనపూజల నొనరించెదను. నాకుఁగల గృహభూమిధనధాన్యవస్త్రాభరణములు సర్వస్వము మీకందరికి దానముగ నిచ్చితిని. సర్వము శ్రీరామార్పణము. మీరు మాఱు పలుకక పరిగ్రహించి నన్ను కృతార్థుని జేయుఁడు. (కమల, రఘురాముఁడు, రామదాసు, విప్రులకు నమస్కరింతురు.)

బ్రాహ్మ—రామదాసుగారు! ముందు మీగతియేమి? భార్యయు, కుమారుఁడున్నారే?

రామ—సీ. రాముఁ డొక్కఁడె నాకుఁ బ్రతిపన్న భాగ్యంబు
జీవనాధారంబు జీవితంబు
రాముఁ డొక్కఁడె నాకు ప్రేమబంధుబలంబు
సకలభోగఫలంబు సమ్మదంబు
రాముఁ డొక్కఁడె నాకుఁ బ్రాకటదైవంబు
సేవింపభజియింప శ్రీకరంబు
రాముఁ డొక్కఁడె నాకు రక్షకరాజంబు
సంసారక్షతినార్ప సత్పథంబు

గీ. రామసేవయె నామది గామితంబు
రామసేవయె నాకింక ధీమతంబు
రామసేవయె సుజనవిభ్రాజితంబు
రామసేవయె భువిలోసుధీమతంబు.

శ్రీరాముఁడున్నాఁడు నాకేమితక్కువ?

బ్రాహ్మ—రామదాసుగారు! నేనొక దాన మడిగెదను. ఒసఁగెదరా?
రామ—స్వామీ! అదియేమి?

బ్రాహ్మ—మీరామభజనవిధానము వేఁడెదను.

రామ—అవశ్యము కానిండు.

(అనుబంధము 27.)

అందఱు—(భజింతురు.)

తృతీయరంగము—నెలకొండపల్లె వెలిభాగము.

[ప్రవేశము రఘురాముఁడు జాబుతో]

రఘు—నాజనకుఁడు నివేదించిన తెఱగున జరిపితిని. మాయయ్య నాచేతికి నీపత్రికనొసంగి, నేను మూఁడుదినములు సీతారామ శాస్త్రిలయింటియం దుండవలయుననియు, నాల్గవదినమందు నే నీ పల్లెవిడిచి బయలువెడలి యీజాబును చదివి యందులోని యర్థముగ్రహించి ప్రవర్తింపవలయుననియు నానతిచ్చెను. నేఁడే నాల్గవదినము. ఊరివెలుపటికి వచ్చియున్నాఁడను. ఈజాబును జదివెదను. (అని జాబువిప్పి) దీనిని నామాతామహుడగు నక్కన్నకు వ్రాసియున్నాఁడు “మాతులా! నేను రామదాసుఁడ నని నీకు దొలుతనే తెలిసియుండినది. ఇప్పుడు నాపేరే రామదాసని నాదేవుఁడు రామచంద్రుఁడు పెట్టియున్నాఁడు. నాసర్వస్వము భూసురులకు నిప్పించియున్నాఁడు. అక్షయమగు సంపత్తిని సంపాదింపుమని నాకానతి నిచ్చియున్నాఁడు. భద్రాచలమునకుఁ దనసన్నిధికి నన్ను బిలిచియున్నాఁడు. దైవాజ్ఞను బాటించి నేఁ జనుచుచున్నాఁడను. నాప్రాణకాంత నావెంటనే యున్నది. కుమారుని రఘురాముని నీయొద్దకుఁ బంపినాఁడను. శ్రీరాముఁడు నీహృదయమున నెట్లుదోఁచునో యావిధమునఁ జేయుము.

ఇట్లు,

రామదాసు.”

ఆహా ! ఇదెట్లువచ్చెను. నాజననీజనకులు నన్నుఁబాసి 'భద్రాచలమునకుఁ' జనుదెంచిరి. నేను నరిగెదను. (అని ముందునకు నడచి నిలిచి) ఆహా ! నాజనకునియాజ్ఞ నుల్లంఘించుచున్నాఁడనే ? ఎంతటి యపరాధమగును ? నాయనగారి నియమముమేరకు గోలకొండకు నేఁబోవ నేవలయును. పిదప రాముఁడున్నాఁడు. గోలకొండకు బోవువార నేకులుందురు. ఎవ్వరినైన వేఁడుకొని వారివెంటఁబోయెదను. (ముందుకు నడచి) నాచేత నొక్కకాసైనను లేదే ? ఏమిచేయుదును ? నే నెంతటి యవివేకిని ? ఎదుట రాజమార్గమున్నది. చూడను కన్నులున్నవి. అడుగను నోరున్నది. నడువను కాళ్ళున్నవి. తోడునీడగ శ్రీరామచంద్రుఁడున్నాఁడు.

(అనుబంధము 28.)

[ప్రవేశము - రాజభటులు - నబీ - ఖాదర్.]

ఖాదర్—అరేనబీ ! నెల్లఖొండాఫల్లెతమాంఘూండి ఘోపన్నఘూరు గాయబ్. ఇల్లుఆకిలి, జేవర్, జమీాన్, సామాన్, అస్ బాబ్ సబ్ బొమ్మన్కుదేకర్, జోరూకులేకర్, కొడుకుకీఛోడ్ కర్ యాటికో ఫరార్, ఈసర్కారీఖాయిదం యేమిశయ్యాలె ? ఘోపన్నసిక్కలేదంటె హక్కన్ను మనగొంతే పిసికియేస్తాడు, అరేఅల్లా ! క్యాఆఫత్ ?

నబి—అరేఖాదర్ ! ఘోపన్నాకిలడ్కా సాస్త్రియింట్లో ఉండాడు. బోత్తే ల్యాదర్యాప్తిసేస్తివాలేదా ?

ఖాద—ఆపిల్లఘూడూభీ తెల్లారిలేసి యెల్లిపోయాకర్కే సాస్త్రిబోల్కే బొమ్మ్సారా.

[ప్రవేశము - సీతారామశాస్త్రి - రఘురాముని చెయ్యిపట్టుకొని]

సీతారామ—నాయనా ! నీవెక్కడ ? గోలకొండయెక్కడ ? ఒంటరిగా నీవు పోఁగలవా ?

రఘు—శాస్త్రిలవారు! రామచంద్రుఁడు నావెంటనుండ నే నొంటరి నెట్లగుదును ?

శాస్త్రి—కుమారా! యీచిన్నితనమున నీసాహసము చేయకుము. రమ్ము నాయింటికి. నేను నీకు జతగలిగించి పంపెదను.

ఖాద—(ముందఱకువచ్చి) సాస్త్రీజీ! ఘోపన్నగారిపర్ జంద్, బేటా యీండ్లేనా ?

శాస్త్రి—ఔను సాహేబు!

ఖాద—
నబీ— } (వంగివంగి రఘురామునకు సలాములు జేతురు.)

రఘు—అయ్యలారా! మీరెవరు ?

ఖాద—మహారాజ్! మేము హక్కన్నాదివాన్‌బహద్దర్ ఛప్రాసీలము. మీనాయనఘూరీకి యీఖాయిదం తెస్తావుండాం వాలిద్‌ఘూరూ యాడావుండారు మేహర్‌బాసీ సెప్పండి.

రఘు—నాతండ్రి యెచ్చటనుండునది నేను జెప్పనే వలయునా ?

ఖాద—మీరు సెప్పాల్యాకుంటే మాకి పాణాల్ దక్కుతాపీ లేవు. హక్కన్నా మాకీ గల్లాకి యేస్తాడు, సామీ నాధేవుడా! మాను జాగ్ బక్‌షీ యియ్యాలె (అని కాళ్ళుఁబట్టును.)

రఘు—అయ్యలారా! నే నక్కన్నగారియొద్దకు వచ్చెదను. నన్ను దోడ్కొనిపొండు.

ఖాద—అయ్యోసామీ! మీయయ్యాకి మేము సూడకా, యీఖాయిదం యియ్యాకా యిడిసిపోతె సస్సిపోతాం, అరేఅల్లా! సస్తే మల్లీయెట్లా భత్కాలె ?

రఘు—అయ్యా! చెప్పెద వినుము. నాతలిదండ్రులు భద్రాచలమునకుఁ బోయియున్నారు.

ఖాద—యాపర్ వర్దిగార్! భత్కీతీమి. గోల్ఖొండాకి మేము పొమ్యో ధోవా ఆధే. ధాన్కియేమి యేమిసె ప్తీరి? "భర్నాచిలం" అధే ధోవ పోదాం రాండి బిస్మిల్లా.

శాస్త్రి—సాహేబు! యీబాలకుని నడపించుకొని పోయెదవా?

ఖాద—ఏమయ్యా! అట్లాసెప్పూతావు. మాఖీపేరు హాక్కన్న యిలా కావాడూ సెప్పితే బగ్గీల్కీ ఘూడాల్కీ థకూవవుంటూడా.

శాస్త్రి—అట్లయిన మాయింట భోజనము జేసిపొండు.

ఖాద—(కడుపునివురుకొని) హాఫిజే అల్లా! హెూ తుమారేభల్లాం చలో బిస్మిల్లా! అరేనబీ! నేను యింథామాటాలుసెప్పితీ. నీవు నోరుతెరిసేకీల్యా, యింఖాబొమ్మఁకీ పులావుకన్నానోరూ తెరస్తాడా?

నబి—బేషక్, అల్బత్, జరూర్, బిలాఅందేషా, బిలాహార్కత్ బేధడక్.

ఖాద—బస్బస్ చలో.

(నిష్క్రమింతురు.)

---

## తృతీయాంకము - చతుర్థరంగము.

(భద్రాచలము - కొండక్రింద ఉపవనము.)

(పౌరులు విందుఁజేయుచుందురు.)

పౌర—ఆరేయాఁర్! యింత జల్దిజల్ది ముగిసెజల్సాలు నేను బిల్కుల్ పసందుచేయను.

పౌర—జల్ది యేమోయీ, పజర్వచ్చినాము. షామ్కు పోతాము.

పౌర—పొద్దుగాల వచ్చి సందెకు పోతే యేమి మజాఉంటుంది. రాత్రి అంతా బగీచాలోనే ఉండవలె.

పౌర—అరేయార్ ! ఈయిరాదా నీకు ఉంటే నేను చెప్పుతాను విను. మనదుకానాలు, మామిలాలు, అన్నిబందుచేసి మూడుదినాలు యింటితరపే చూడకూడదు. బాగేబాగ్ మనమే మనము మిసర్ నుంచి మిశ్రీజాన్, ఆగ్రానుంచి అంగూర్ జాన్, అజ్మీర్ నుంచి అంజూర్ జాన్, బరోడానుంచి బాదాంజాన్, గుల్బర్గానుంచి మల్గోబాజాన్, వీండ్లను పిలిపింతాము. పగలురాత్రినాచ్, రంగ్, ఢంగ్, సంగ్, కడుపునిండిపోతుంది.

పౌర—బాదాం, మిశ్రీ, మల్గోబా, తింటే కడుపునిండ కేమి? యిన్ని తాయిఫాలకు పయిసా యిచ్చేకాటికి, కడుపుపగుల్తుంది.

పౌర—దాని కేమిరా? ఒకొకజాన్కు దస్దస్హజార్, అయిదుగురికి పచ్చాస్హజార్ క్యాబడిబాత్ ?

పౌర—అచ్ఛా! చందాపట్టి తయార్ చేయి.

పౌర—అరేభాయి! మనవూరు షర్బత్ జాన్ వచ్చును. ఖామూష్

[ప్రవేశము షర్బత్ జాన్ - కొందఱు వేశ్యలు.]

షర్బత్—(పాడుచు)

(అనుబంధము, 29.)

అందఱు—(వినోదమును చేయుదురు.)

అనుబంధము. 30

[ప్రవేశము - రామదాసు - కమలాంబ]

రామదాసు } పాట - నం 31 రాగము—యమన్ మాండ్,
కమల } తాళము - రూపకము.

రామచంద్రరమ్యసదన - శ్యామలాంగ శేషశయన
సామజేంద్రతాపదమన - సాధుపాలనా॥

1. దేవనాథవినుతచరణ - దీనబంధో దురితహరణా ।
శ్రీవధూటిచిత్తరమణ - శ్రేయకారణా ॥రామ

2. కామితార్థదానశూర - కంజనేత్రజ్ఞానసార ।
భూమిజాసతీవిహార - ప్రేమసాగరా ॥ రామ॥

రామ—ఓపుణ్యపురుషులారా! మిమ్ము సృజియించిన భగవంతుని శ్రీరామచంద్రునిఁ గొండపైనఁబడవైచి నిలువచోటులేక, యెండకు నెండి, వానకుఁ దడిసి, గాలికిఁ జలించి, చలికి వణఁకి సంక్షోభముఁ జెందంచుచున్నారే? ఆ పరమపురుషునకు దేవాలయము గట్టించుపుణ్యబుద్ధి యొక్కరికిని గలుగకున్నదే !

సీ. మిమ్ము నిర్మించినమేటిదేవుఁడొకింత
యాలయంబెలయక నడలుచుండ
నగరకేఁగృహానవ్యహర్మ్యంబుల
వసియింతురే మీరు వణిజులార !
ధరాత్మ్యులై మీకు ద్రవ్యసంపదలిచ్చి
రక్షించునట్టి యారామచంద్రు
ధరియింపనొక్క యాభరణమైనను లేని
రిక్తునిజేతురే భక్తులార !

గీ. విమలవైకుంఠధాముఁడే! యమరనాథ
మానసకమలభ్రమరుఁడే! మంగళకర
నాముఁడే! ద్యుమణికులాబ్ధిసోముఁడై ! య
కటకటా ! మీమదియెటుల గరఁగదాయె.

ఏపరమాత్ముఁడు సీతాలక్ష్మణసహితంబుగ నివసించుటంజేసి పర్వతశ్రేష్ఠుండగుభద్రుఁడు కృతార్థుఁడై తదీయాశ్రమంబున నీపురము వర్ధిల్లినది

యో, యేభగవంతుఁడు మానవావతారంబున సకలధరామండలచక్ర వర్తియై ధర్మపరిపాలన మొనరించెనో, యేదేవుని నామస్మరణచే సర్వ దురితంబులు పరిహరింపఁబడునో, యేసర్వేశుని సేవించుటచే సర్వాభీష్ట ములు సిద్ధించి కైవల్యము లభించునో, యేలోకరక్షకుఁడు ప్రపంచమునం తయుఁ బోషించుచున్నాఁడో, యేదానశీలుఁడు మీకు భాగ్యంబునొసఁగి మిమ్ముల నానందింపఁజేయుచున్నాఁడో, యారామచంద్రుని మీరు నిరసించియున్నారే! ఆసుకుమారుని, నకలంకుని, శృంగారవిలాసుని, పూజనీయుని ప్రాణకాంతతో దమ్మునితో గిరిపైన మఱుగులేక నిలువఁ బెట్టి మీరు విలాసలోలురై యున్నారే? అకటా! కన్నతండ్రిని కాన కుఁదోలి యతనిభాగ్యము ననుభవించుకృతఘ్నులు కారా మీరు? ఈ సౌఖ్యముస్థిరమా? మీదేహములు శాశ్వతములా? లెండు. భద్రగిరిరామ భద్రునకు దేవళము కట్టింపుఁడు. ఆభరణముల నర్పింపుఁడు. సేవలఁ జేయుఁడు. ఉత్సవములను జరుపుఁడు. పూజింపుడు. భజియింపుడు.

1. పౌర—మహమ్మదీయరాజ్యములో స్త్రీని వెంటఁబెట్టుకొని తిరుగు మర్యాదగలవాఁడవు నీవా మాకుపదేశము చేయునది. పో పొమ్ము.

2. పౌర—ఏమయ్యా? నీవొక్కఁడవేనా దేవుని జూచియుండునది? నేను దస్‌హజార్, బల్కే దస్‌లాక్, మఱిబల్కే దస్‌కరోడ్, దేవుండ్లను జూచి యున్నాఁడను.

1. పౌర—ఓయీమాదన్నా! యితఁడు హరిశ్చంద్రనాటక్ ఆడు చున్నాఁడు. ఈస్త్రీయమ్మకు వెంటఁదెచ్చినాఁడు.

3. పౌర—ఛీ! బుద్ధిహీనులారా! దైవభక్తులతో విరసము లాడ వచ్చునా? యూరకుండుడు. స్వామీ! మీరు చెప్పినదంతయు వాస్తవమే. ఇక్కడ జనులలో నైకమత్యములేదు. ఒకఁడు మంచికార్యమొనరింపఁ బూనెనేని మఱియొకఁడు వలదనును.

తాయిఫాలకు జల్సాలకు చందాలెత్తిన వేలకొలంది పోగగును. మాయూరునకు హిందూదేవతాభిమాని యగు తహశీల్దారుఁడు రానందున రాముఁడు గుట్టపై నక్కియున్నాఁడు. మాకు రాజు తహశీల్దారుఁడే. ఉన్నరహస్య మిది.

1. పౌర—అట్లయిన నీ వీయయ్యగారికి తహశీల్దారుపని నిప్పింపుము.

2. పౌర—మొదట నాకు బాదుషాపని యిప్పించిన నీయయ్యగారికి నేను తహశీల్దారుపని యిచ్చెదను.

[ప్రవేశము - - రాజభటులు - రఘురాముఁడు.]

ఖాదర్—రస్తాఛోడో. చలోబాజూ. (అనియదలుచును.) పౌరులు ప్రక్కకుఁబోదురు.

ఖాదర్—(రామదాసునకు సలామొనర్చి పత్రికనిచ్చును.)

రామ—(పత్రికను చదివి భక్తియుతుఁడై)

పాట - సం. 32 - రాగము ధన్యాసి - తాళము రూపక.

నిను నేఁ గొనియాడఁదరమ ? ఇనవంశచంద్రరామ ॥రామ॥

1. వనజోద్భవాదులే కనలేనివాఁడవే ।
నిను నమ్మినభక్తులమది ననుమోదము నించెదే ? ।
ఘనశుభకర, జనపతివర ॥నినునే॥

2. సరసీరుహేక్షణా ! కరిరాజపోషణా ।
మురరాక్షస ప్రాణహరణ వరకౌస్తుభభూషణా ।
అరికులమదదమన సుగుణ ॥నినునే॥

రామచంద్రా ! నీప్రభావము బ్రహ్మరుద్రాదులకును దెలియ నసాధ్యముగదా ? (అని కమలకు బత్రికనిచ్చును.)

కమల—(చదివి భక్తియుక్తయై)

పాట - నం. 33 - రాగము కన్నడ - తాళము రూపక.

దశరథరామహరీ ! శౌరీ ! మురారీ !

దానాభిరామా ! దనుజవిరామా॥ దశరథ॥

1. వరశాంతిగుణశీల - వైదేహీసతిలోల ।

సురలోకపాల - హరీ మురారీ॥ దశరథ॥

2. చిరకాంతిసువిలాస - శ్రీభద్రగిరివాస ।

కరిరాజపోషా - హరీ మురారీ॥ దశరథ॥

(కుమారునిఁ జేరదీసి) రఘురామా ! పసిపాపఁడవై ప్రపంచమాయలెఱుఁగనిచిఱుతవై కన్నవారి నిదివఱకెన్నఁడును మానియుండని పిన్నవైయున్న నిన్నొంటరిగ వదలి మే మరిగినందుకు నీవు కనలు వహింపకుము. తలిదండ్రులపైనఁ బాయనిమమత గలిగియుండుట తనయునకెన్నటికిని మేలుకాదు. పుత్త్రునకు పేరునకుమాత్రమే మాతాపితలు పోషకులు గాని నిజమైనరక్షకుఁ డారామచంద్రుఁడే. ఆరామభక్తి నీకొనగూడి తనరుచుండుట మే మెఱింగియే నిన్ను దొలఁగితిమి. రాముఁడు మరల నిన్ను మాయొద్దకే పంపెను. మిగుల సంతసమాయెను.

(అనుబంధము 34.)

రామ—సిరస్తాదారుఁడు వచ్చియున్నాఁడా ?

సిరస్తా—మహాప్రభూ ! సిద్ధుఁడనైయున్నాఁడను.

రామ—ఈరాజాజ్ఞ నెల్లరకును జదివి చెప్పుము.

సిరస్తా—చిత్తము. (అని చదువును.)

శ్రీ గోలకొండ.

"అక్కన్న దివానుగారి యాస్థానమునుండి నెలకొండపల్లెలోనుండు శ్రీమతు పండితగోపన్నగారికి వ్రాసినది.

మా రాజ్యమందున్న భద్రాచలముజిల్లాతహశీల్ దారుఁడుమాల్వీ అల్లావుద్దీన్ సాహేబును తబాదిలాచేసి యాస్థానమునకు తానీషాబాదుషాగారు మిమ్ములను తహాశీలుదారుగ నియమించియున్నారు. భద్రాచలమునకు మీయట్టిసాధువులే తహాశీల్ దారులుగ నుండవలయునని రాజుగా రభిప్రాయపడియున్నారు. కాన మీ రీయాజ్ఞ నంగీకరించి తత్క్షణము పనిలో ప్రవేశించి జిల్లాను కుశలముగ పాలింపవలయును.

దివాన్ అక్కన్న"

పౌరులు—(భీతితో రామదాసునకు నమస్కరించి) స్వామీ! యెన్ని మాటలాడితిమి? ఎంతయపరాధముఁ జేసితిమి? మాతప్పులు క్షమింపవలయును.

రామ—(నవ్వి) మీ దేమియుఁ దప్పు లేదు. అపరాధములు క్షమించి రక్షింపను రామచంద్రుఁడున్నాఁడు.

1. పౌర—స్వామీ! నేను చందాపట్టిక నేఁడే సిద్ధపఱిచి యొకవారము లోపల నొకలక్షవరహాలు ప్రోగుచేయించెదను.

2. పౌర—అందునకు సందేహమేమి? మే మందఱము చందాలకు సిద్ధముగ నున్నారము.

రామ—సిరస్తాదారు! నే నీయుద్యోగము శ్రీరామునియాజ్ఞగ నంగీకరించితిననియు, నాపేరు రామదాసని పత్రికలలో ప్రచురింప వలెననియు, దివానుగారికి వ్రాసి పంపుము.

సిరస్తా—భాగ్యము.

అందఱు—(మేళతాళములతో రామదాసును పిలుచుకొనిపోదురు.)

తృతీయాంకము సమాప్తము.

శ్రీరస్తు.

# రామదాసు

## చతుర్థాంకము.

ప్రథమరంగము - అంతఃపురము.

తానీ—(రాజకీయపుకాగితములు చదువుచు, నుత్తరువులు చేయుచుండును.)

మోతీ—(ప్రక్కనుండి సిరా యొత్తుచుండును.)

సితా—(వెనుకనుండి సితారా యేమఱించి వచ్చి మోతీకి సైగ చేయును.)

మోతీ—(తిన్నగ ప్రక్కకు దొలఁగును.)

తానీ—(తలవంచుకొని యుండియే) హుషియార్ ! కాగజ్ ఖరాబ్ హోజాంగీ !

సితా—(ఎక్కువ చేష్టలుచేయును.)

తానీ—(తలయెత్తకయే) ఖబర్దార్ ! సజామిలింగీ !

సితా—యాద్ రఖో ! తన్ఖా, నహీఁమాంగింగి.

తానీ—(కోపమున మోతీనిచూఁచి) అజీ! మైతానాక్ బచ్చీ! క్యాబోలీ?

మోతీ—సర్కార్ ! మై నహీఁబోలి.

తానీ—అవుర్ కోన్ బోలీ ?

మోతీ—బేగంసాహేబా.

తానీ—ఝూఁఠీబాత్ కహీఁహాఁ ? ఆప్ యిధర్ ?

[ప్రవేశము - సితారా]

సితా—హుజూర్! యేమోతీ మేరీ ఖాదిమాహై. ఆప్కే యిలాఖానహీ.

తానీ—(నవ్వి) అచ్ఛా! ఆవ్ మలికా! సర్కారీకార్‌బారేమే ఆప్కీ యిందాద్ ముబారక్ హోతీహై.

సితా—ఆలాహజ్రత్! యేజాయ్ హమారిజనానీ, ఖాస్, ఖిల్‌వత్ కమ్రేహైషాహీ దఫ్తర్ నహీహైం?

తానీ—(నవ్వి) బహుత్ అచ్ఛా! అవుర్ క్యాహుకుంహై?

సితా—మోతీ! ఓకాగజాత్ సబ్ అందర్ లేజావ్.

మోతీ—జోహుకుం! (అని కాగితములు కొనిపోవును.)

తానీ—(నవ్వుచు) అబ్ క్యాయిర్షాద్‌హై?

సితా—ఆప్‌చాహేతో రఖ్‌సక్తే; చాహేతో తషీఫ్‌లేజాసక్తే కుచ్ నహీ బందిష్.

తానీ—ప్యారీ! మైచాహ్తాహుం ఆప్కీ! హాం ఆగోష్.

సితా—హాం! ఖామూష్.

(అనుబంధము 35.)

సితా—ప్రాణేశ్వరా! నాయపరాధము మన్నింపుము.

తానీ—కాంతామణీ! యిట్టివేడుక నొసంగునట్టి యపరాధముల ననవరతము చేయుచునే యుండుము. పోనీ, ఉదయము శ్యామలాంబ యేల వచ్చియుండెను?

సితా—నాథా! శ్యామలాంబ భద్రాచలవిషయము మిగుల ప్రశంసనీయవార్తలు చెప్పెను. రామదాసు కన్నులకు పండుగచేయు దేవాలయము గట్టించియున్నాఁడనియు, సతనిభార్య స్త్రీలకు విద్యగఱపుపాఠశాలలును, దైవభక్తివర్ధిల్లఁజేయు ధ్యానమందిరములును నేర్పఱచి పాటుపడుచున్నదనియుఁ దెలియవచ్చెను.

దేశములకు నేను బంపియుండిన నాదూతికలుసయితె మీావిష యము చాలపొగడిరి. నీవు సమ్మతింతువేని నేను శ్యామలాంబ తో భద్రాచలమునకుఁబోయి తగిన సహాయముచేసి వచ్చెదను.

తానీ—కాంతా! ఆరామదాసువిషయము చెడుగువార్తలు నాచెవులఁ బడుచున్నవి.

సితా—ప్రాణేశ్వరా! పురుషుని చెడుగుచేఁతలు స్త్రీసంఘములో దొలుత చర్చింపఁబడి తర్వాత వీధికెక్కును. నాదూతికలు నాతో నిట్టివార్తలుండెనేని చెప్పియుందురు. కావున నసూయచే కల్పించి కల్లలుపుట్టించువారిమాటలు నమ్మకూడదు.

తానీ—ఈవిషయము నేను విచారింపఁబూని భద్రాచలమున కధికారులఁ బంపియున్నాను. ప్రధానిని నేఁడు రమ్మని పిలిపించియున్నాఁడను.

సితారా-తానీషా—సంభాషణ పాట నం 36.

రాగము జంజూటి - రూపకతాళము.

సితా—పాడిమెనాథా! భక్తునినింత - బాధించుసమ్మోదము?
ఈపాడిమిఫలమా! పోవలదువినుమా!
వీడుమ యీభావము॥ పాడియె॥

తానీ—ఏలనేకాంతా! ఇంతటిచింత - మేలుగయోచించెద।
నే - తాలిమితోడ - ధర్మపు జాడఁ-
దప్పకగాపాడెద॥ ఏలనే॥

సితా—రామదాసునిగాసింపనెంతువె? రాజ - సంబును
సారింపఁజూతువె?
ఇది దోసమగుర్ - విడు, వాసిచెడుర్ -
కడు, మోసమగుర్ - సిరి, నాశమగుర్॥ పాడియె॥

తానీ—సార - వంద్యులఁబూజించుచున్నాను-
సత్యసంధుల సేవించుచున్నాను-
కోరి, నింద్యము జేయను - సందియమేలను
నారీమణి నను - దూరుటచాలును॥ ఏలనె॥

[ప్రవేశము - మోతీ.]

ఖొజ్జా—మహారాజా! ప్రధానిగారు వచ్చియున్నారు.

తానీ—రమ్మనుము. (సితారానుజూచి) కాంతా! నీవు లోనికిఁబొమ్ము.

సితా—(నిష్క్రమించును.)

ప్రధాని—[ప్రవేశము సలాలములుచేయును.]

తానీ—ప్రధానీ! ఆభద్రాచలమునకుఁబోయినయధికారులు వృత్తాంతమేమైన వ్రాసియున్నారా? మనపట్టణమువార లనేకవిధములైన లేఖలు నాకు వ్రాయుచున్నారు?

ప్రధా—మహారాజా! మొదటపోయిన రాజా నరసింహారెడ్డిగారు మనవిని పంపినారు. వెనుకపోయిన మౌల్వీ మొహిద్దీన్ హుసేన్ గారి విన్నప మింకను రాలేదు.

తానీ—వచ్చినదానిని చదువుము?

ప్రధా—చిత్తము. (చదువును.)

శ్రీమద్రాజాధిరాజకంఠీరవులగు తానీషాబాదుషాగారి దివ్యసన్నిధికి, సేవకుఁడు నరసింహారాఘవరెడ్డి సమర్పించిన విన్నపములు...

రాజాజ్ఞను శిరసావహించి నేను రహస్యముగ సంగతులన్నియు విచారించితిని. పండిత రామదాసుగారు తహశ్శీల్‌దారుపనిలో ప్రవేశించినదాదిగ జనులకు మిగులక్షేమము కలిగినది. పంటలు సమృద్ధిగాఁ బండినవి. రైతులు రాజకీయపుపన్నులు నిలువలేక చెల్లించుచువచ్చినారు. దండనార్హాభియోగముల విచారించుట కొకనేరమైన జరుగలేదు. వెనుక

నుండిన 2140 మందిఖైదీలు శ్రీరాములదేవళములో సంకెళ్ళులేక పను లుచేయుచు సుఖభోజనములొనర్చుచుండి విముక్తులైయున్నారు. ప్రజలలో నేలాటికలహములు లేవు. న్యాయస్థానమున వ్యవహారమొక్కటైనలేదు. అప్పిచ్చినవారు తీర్పను శక్తిలేనివారి నడుగరు. అట్టివారు దేవతాసేవలుచేసి ఋణవిముక్తులగుచున్నారు. జిల్లాయంతయును రామ రామశబ్దములతో నిండియున్నది. బానుసాగారియంగీకారముతో దేవాలయము తహశ్శీల్దారుగారి యధికారములోనికి తేఁబడినది. అందులో రెండులక్షలపైకము భక్తులచందావల్ల ప్రోగైనది. మిగతయారులక్షలు రైతులు రాజున కీయతగినపన్ను. ఈవిషయమున నీసంవత్సరపు పన్ను పైకము రైతులనడుగకుండ మన్నింపవలయుననియు, నాపైకము దేవాలయమునకు రైతులు వ్యయపెట్టుదురనియు, నొకవేళ రాజుగారు మన్నింపను సమ్మతింపరేని, యాపైకము నప్పుగాఁజేసికొని యేఁటేటఁ గొంచెము కొంచెముగా రైతులు తీర్చెదమని చెప్పియున్నారనుసంగతిని, అంగీకారముకొఱకు తహశ్శీల్దారుగారు సన్నిధికివ్రాసి ధర్మకార్యముకొఱకు రాజుగారు తోడ్పడుదురని నమ్మి ముందుగ నాద్రవ్యము వ్యయముచేసియున్నారు.

తానీ—ప్రధానీ! ఈసంవత్సరము పైకము మన్నించుమని తహశ్శీల్దారు వ్రాసియున్నాఁడా?

ప్రధా—వ్రాయలేదు.

తానీ—అక్కన్నగారిని విచారింతము.

ప్రధా—అక్కన్నగారు మూఁడుమాసములు సెలవుపైనున్నారు.

తానీ—జిల్లాలకాగితము లెవ్వరుపుచ్చుకొని పరిష్కరించుచున్నారు?

ప్రధా—తమసేవకుఁడను నేనే. భద్రాచలమునుండి యీలాటివిజ్ఞాపన నిక్కముగ రాలేదు.

తానీ—దీనిలో నేమో మోసమున్నది. అక్కన్న సెలవుపైనుండునది తహాశ్శీల్‌దార్లందఱికిని తెలియునా ?

ప్రధా—మహారాజుగారక్కన్నగారికి పూర్తిగా సెలవునియ్యక జాహగీర్ పనులనుమాత్రము చూచుచుండుమని నియమించినందున వారు సెలవుపొందినట్లొకరికి తెలియదు.

తానీ—ఓహో! రామదాసు వంచనచేసియుండునా ? అక్కన్నను పిలిపింపుము. విచారింతము.

ప్రధా—సేవకునిమనవి చిత్తగింపవలయును. ఒకవేళ నట్టి విజ్ఞాపన వచ్చియుండినను రాజుగారందులకు సమ్మతించుచుంటిరా ?

తానీ—ఏమో మీతో నాలోచించుచుంటిని. దేవతాకార్యముకదా ?

ప్రధా—మహాప్రభూ! ఎనిమిదిలక్షలే! దేవళమునకు యెనిమిది వేలు పట్టును. లేకున్న నెనుబదివేలుపట్టును. రెండులక్షల చందా పోయెను. ఆఱులక్షల సర్కారుపైకమును గుడిమ్రింగెను. వెండి గోడలు కట్టినను నింతవ్యయమగునా ? ఇట్టివ్యయములకు రాజులు సమ్మతింపవచ్చునా ? మహమ్మదీయులు వెఱ్ఱివారని హిందువు లనుచునేయుందురు. ఈసమయముననే యక్కన్నగారు సెలవుగోరిరి. ఈసంగతులన్నియు వినినట్టిప్రజల నోళ్ళనుమూయ మనకు నలవియగునా ? భయముచేత బహిరంగముగా దూషింపకున్నను లోలోపల నిందింతురు. ప్రభుత్వమునకు గొప్పయపకీర్తి కలుగునని నాకు మిగులభయమగుచున్నది. దీనిపైన మీ చిత్తము.

[ప్రవేశము - మోతీ ప్రధానికిం బత్రికనిచ్చును.]

ప్రధా—(చూచి)మాల్వీగారివిన్నపముగూడవచ్చినది. (అనిచదువును.)

"ఆజ్ఞ మేరకు పన్నులపైకమువిషయము విమర్శించితిని. రైతులు చెల్లించియున్నారు. రాజుగారికి విన్నపము వ్రాయకయే, యంగీకారము పుచ్చుకొనకయే, రైతులను మోసపరచి యాద్రవ్యము రామదాసుగారు వాడుకొన్నారు. నరసింహరాఘవరెడ్డిగారు, రామదాసు పక్షపాతము చాలాచేయుచున్నారు."

తానీ—(కోపమున) ప్రధానీ! సంగతులు పరికింపఁగా మామయు నల్లుఁడు నేమో దుష్కృత్యము జేసినట్లు తోఁచుచున్నది. రామదాసును చెఱపట్టించి యతనిని నగదు, వెండి, బంగారు, సొత్తులతో నిచ్చటికి తెప్పింపుము. అక్కన్నయొక్క సొత్తులన్నియు జప్తుచేయించి యుంచుము. ఇది నాయాజ్ఞ. ఆలస్యము చేయకుము. పొమ్ము.

ప్రధా—చిత్తము. (అని పోవును.)

[ప్రవేశము—సితారా.]

సితా—ప్రాణేశ్వరా! యీప్రధాని దుర్మార్గుఁడు, హిందువులకు విరోధి. అసత్యవాది.

తానీ—నిక్కము దెలియక యూరక యొకరిని నిందింపకుము.

సితా—నేను ప్రక్కనుండి పరీక్షించుచుంటిని. ప్రధాని మిమ్ములను మోసపుచ్చినాఁడు.

తానీ—ఇందు మోసమేమున్నది? రామదాసువచ్చిన విచారించెదను. న్యాయము బయలుపడును.

సితారా— (అనుబంధము 37.)

అయ్యో! దైవభక్తుని చెఱపట్టించి తెప్పింపవచ్చునా? పూజనీయుఁడు గదా?

తానీ—కాంతా! ప్రజలతాత్పర్యములు పెక్కు తెఱఁగుల నుండును. రాజగువాఁడు నిష్పక్షపాతమనస్సునఁ బ్రవర్తింపవలయును.

సీతా—నాథా! నీవుచేయువిచారణ నేను తిలకించి యాలకింపవలయును.

తానీ—కానిమ్ము.

నేపథ్యమందు—"అల్లాహో అక్బర్!" (అని ధ్వని)

[ప్రవేశము—మోతీ.]

మోతి—సర్కార్ - నమాజ్ కా ఆజాఁ హెూతీహై.

(నిష్క్రమించును.)

---

## చతుర్థాంకము—ద్వితీయరంగము.

రామదాసు యిల్లు - రాములపటము.

[ప్రవేశము—రామదాసు—కమలాంబ—రఘురాముఁడు]

(రఘురాముఁడు చిత్తరువు వ్రాయుచుండ రామదాసు కమలాంబ పూలహారములు కట్టుచుందురు.)

రఘు—జనకా! మనరామచంద్రునికుమారులకు కుశలవులని వింత పేరులేల పెట్టిరి?

రామ—కుమారా! వాల్మీకియాశ్రమంబున సీతాదేవి యర్ధరాత్రము నందుఁ బ్రసవించెను. పుట్టినశిశువులను భూతములు సోఁకకుండ ఋషీంద్రుఁడొకదర్భను మంత్రించి దానికొన నొకబాలుఁడును, మొదలొకబాలుఁడును ధరింపఁజేసెను. అందుచేత నాయమ ళలు కుశలవు లనఁబడిరి.

రఘు—అయోధ్యాపట్టణము మాని సీతాదేవి యరణ్యమున వాల్మీకి యాశ్రమమున నేల ప్రసవించెను?

రామ—శ్రీరాముఁడు పంపియుండెను.

రఘు—ఎందులకు?

కమ—కుమారా! అది యుండనిమ్ము. నాథా! శ్రీరాములు సీతాదేవిని యాతీరునఁ గానపాలుచేసినది నీవు న్యాయమందువా?

రామ—శ్రీరాములు మానవదేహముతో నుండినందున లోకాపవాదమునకు వెఱచి యట్లొనర్చిరి.

కమ—నాథా! కాంతను యడవిపాలుచేసినందుకుమాత్రము రాములకు లోకనింద తప్పెనా?

ఉ. సీత యసామ్యసాధ్వియు సుశీల యటంచు సుపర్వులెల్ల సం
ప్రీతిగఁ బల్క నాసతియు భీతి యొకింతయు లేక వహ్నిలో
ఖ్యాతిగ దూఁకదే రఘుకులాధిపుఁ డంపుకు మోదమొందఁడే!
నీతియె భర్తకెందు జననిందకుఁ గాంతను గానఁద్రోయఁగన్?

రామ—కాంతామణీ! నీ వాడినది నిక్కమే; కాని శ్రీరాముఁడుచేసినది తీఱనిపని. అతఁడు పురాకృతకర్మఫలంబు ననుభవించెను.

కమ—నారాయణునకు పురాకృతమా?

రామ—నారాయణుఁడు లోకబోధకుఁడు; కావున దా ననుభవించి ప్రపంచమునకుఁజూపును. పూర్వకాలంబున దైత్యులకు నభయమొసఁగి శ్రీహరిని ధిక్కరించినభృగుపత్నిని జక్రి సంహరించెను. అందునకు భృగుమహర్షి కుపితుఁడై నారాయణుఁడు మానవజన్మమెత్తి భార్యావియోగముఁజెంది సంతాపమొందునట్లు శాపమొసఁగెను. ఆతీరుననే మహాలక్ష్మిసహితము సీతయై భూమిని జన్మించి సంతాపమొందెను. ఎవ్వరుగాని పూర్వ

కర్మఫలము లెట్టివైనను తప్పక యనుభవింపవలయును. రాం బోవు సుఖదుఃఖములు మనకుఁ దెలిసిరావు.

చ. రాకఁ మానదు మృత్యువెంత తనువుఁ రక్షించి భూషించినన్
రాకఁ మానదు దుఃఖమొందుగతి సామ్రాజ్యంబుఁ బాలించినన్
రాకఁ మానదు భాగ్యసంపద మహారణ్యంబునందుండినన్
కాకఁ మానదు దైవచిత్త మెపుడున్ గాలంబుసంధించినన్.

కమ—ఆహా ! నాథా ! యేమిది ? నాదక్షిణనేత్రమదరుచున్నది ? స్వాంతంబున చెప్పరానిసంకట మగుచున్నది. ఎన్నఁ డిట్లు కాలేదు. (అని సొమ్మసిల్లును.)

రామ—కాంతా ! నిమ్మళింపుము.

[ప్రవేశము—అధికారి (బలవంతరావు) భటులు.]

బల—రామదాసుగారూ ! ఈరాజాజ్ఞను వినుఁడు. (అని చదువును.) "జమాదార్ బలవంతరావుసింగుకు రాజాజ్ఞ యేమనగా; నీవు తత్క్షణము భద్రాచలమునకుఁబోయి తహశ్శీల్‌దార్ రామదాసును రాజకీయపుసన్ను నాఱులక్షల నప్పగింపుమని యడుగుము. ద్రవ్యమీయకున్న నతనివెంటనే చెఱపట్టి యతనిఁ నాస్తులను, భండారమున నున్నద్రవ్యములు గైకొని నాయాస్థానమునకుఁ దెమ్ము.

తానీషా"

రామ—బలవంతరావు ! ఈ యాఱులక్షలవిషయము నేను మహారాజునకు విజ్ఞాపనఁ బంపియుంటినే ?

బల—నా కొక్కటియుఁ దెలియదు. పైకమిమ్ము లేకున్న చెఱకు లోఁబడుము.

రామ—(కన్నులు మూసికొనును.)

కమ—రామచంద్రా! ఎంతకష్టమాయెను.

రఘు—రాఘవా! మమ్ము రక్షింపుము.

బల—అయ్యా! ఏమి ప్రత్యుత్తరము చెప్పెదవు?

రామ—నే నేమి చెప్పుదును?

శా. చేతం లేదొకగవ్వ నాకు నిధి యాసీతామనోనాథుఁడే
నాతోడై యెడబాయకుండు ఘనుఁడానాగేంద్రసంసేవ్యుఁడే!
చేతోభీతి నడంచు దివ్యకరుణాసింధుండు నారాముఁడే
యేతెంతుం గొనిపొమ్ము రాజుకడకో యెచ్చోటికో పుణ్యుఁడా!

పురుషపుంగవా! నేను నిర్ధనుఁడను. రాజాజ్ఞ నెఱవేర్పుము.

బల—(బంటోతులకు సైగచేయును.)

భటులు—(సంకెలలు వేయుదురు. కత్తిపహారాతో నిలుతురు.)

కమ—ప్రాణకాంతా! నీవు శ్రీరాములకుఁ జేసినసేవాఫల మింత విపరీతము కావచ్చునా?

(అనుబంధము 38.)

అయ్యో! దైవమే యింతకఠినస్వాంతుఁడైయుండగ మానవుల నిం కేల ననవలయు? ప్రాణేశా! అనవరతము రామరామ యని భజించుచున్న నీచేతులకు సంకెళ్ళా? నిరంతరరామధ్యానపరవశత నున్న నీదేహమునకు నిర్బంధమా? యింతటియాతనకు నే నెట్లోర్తును?

రఘు—(బలవంతరావునుజూచి) అయ్యా! నాతండ్రి నిరపరాధి. ఈ పాపిసంకెలలు నాజనకుని కేల వేసితిరి? వలయునన్న నాకు వేయుఁడు. నన్ను గొనిపొండు.

రామ—కుమారా! కాంతామణీ! యేవేళ కేమివచ్చునది మనకుఁదెలియదని యిప్పుడే చెప్పుచుంటినే. వచ్చినది యనుభవింపక

తీఱును. ప్రపంచమున దుఃఖములు క్షణికములైనవి. సుఖములు నట్టివె. రామసేవాకృతఫలమొక్కటియే స్థిరమైనది. దానికిఁ గాలము రావలయును. శ్రీరామదాసులకు భయమనునది యుండదు. ఈసంకెలలనుజూచి మీరేల విలపించెదరు? ఇవేమి చేయఁగలవు?

మ. యమపాశంబును ఖండఖండములుగా నామూలభిన్నంబుగా
సమయం జేయుచు దివ్యమోక్షపదవిన్ సంధింపఁగల్పద్రుమై
విమలంబౌ రఘురామనామము మదిన్ వేడ్కార నేవేళయున్
తమకం బేచి భజించువారితను వీత్రాళ్ళింక బంధించునా?

(అని చేతులు ప్రక్కకు విసరిన గొలుసులు తునకలై పడును.)

బల—(ఆశ్చర్యపడి రామదాసునకు నమస్కరించి) స్వామీ! మీరు హిమ మామానుషము. మీకు సంకిళ్లువేసినపాపము నాదికాదు. రాజాజ్ఞ జరిపితిని. నన్ను క్షమింపుఁడు. రాజసన్నిధికిఁ బోవుదము. రాజు మిమ్ము శిక్షించునో లేక మీరే రాజును శిక్షింతురో నాకు తోఁపకున్నది. ఈసంకెలలు నాకుమాత్రము రాకుండఁ గాపాడుఁడు.

రామ—(నవ్వి) బలవంతరావు! నీవేమి చేయగలవు? కాంతా! కుమారా! యూరడిల్లుఁడు. నేను లేనని శ్రీరాములసేవ మఱవకుఁడు. రాముఁ డనుగ్రహించెనేని శీఘ్రముగ మిమ్ముఁజూతును. ఈరాజభటులు నన్ను యోగులకు నివాసయోగ్యమగు పుణ్యక్షేత్రమునకుఁ గొనిపోవుచున్నారు: ఆనెలవున దైవభక్తులు భీతిలేక మనఁగలరు.

సీ. శ్రీకృష్ణుఁడనుపేరు చెన్నారధరణిపై
జలజాక్షుఁ డెచ్చోట జననమొందె
బాణనందనయుషాబాలనుఁ బెండ్లాడ
ననిరుద్ధుఁ డెచ్చోట నణఁగియుండె ?
సంయుక్తకలవాణి సత్యాగ్రహంబుచే
తమకాననెచ్చోట తపముజేసె ?
ఆత్మస్వతంత్రంబు నాదియుగ్ విధిచేత
మహనీయు లెచ్చోట మఱుఁగుపడిరి ?
గీ. అట్టిపావనంబగుశాల యలఘుశీల
మలవడినవారికే వలనగువిశాల
లోల, పుణ్యలీలలొనర్ప నాలవాల
మైవెలయుచుండు చెఱసాల కదరనేల.

బలవంతరావు ! పయనమున కాయితపడియున్నాఁడను.

కమ—నాథా ! నేను నిన్నుఁ బాసియుండను. నీవు లేనిచోటు నాకు శ్మశానముగాఁ దోఁచును. నే నుండఁజాలను.

రఘు—తండ్రీ ! నేనును నిన్ను విడనాడఁజాల. నీతోడనుండెదను.

కమ—
రఘు—
దామ—

ముగ్గురి పాట - నం 39.
రాగము - నాటకురంజి - రూపకతాళము.

కమ—నా - నాథనన్ను - బాసిపోయెదే ? - నళినాక్షుని
దయదప్పెనె॥ నాథా, నన్ను॥

రఘు—నా - తండ్రినిన్ను - బాయజాలను తను
జాతుని విడనాడకు ॥తండ్రి నిన్ను॥

రామ—శ్రీ - రాముఁడె మీ - రక్షకుండగుఁ - రమణీ
మణి, విడుశోకము ॥రాముఁడెమీ॥

కమ—శ్రీకాంతుఁ - బాదంబె, యిందాక - సేవింపు -
చున్నానె - చిరమర - కలిగెనే ॥నాథ - నన్ను॥

రఘు—పోరామి - తోనేను - శ్రీరాము - బూజింపు -
చున్నానె - పొదిగెనె, మదివగ॥ తండ్రినిన్ను॥

రామ—మాపాలి - రాముండె - మమ్మెంను - కాపాడుఁ -
ప్రేమాన - మఱువక-గొలువుము ॥రాముఁడెమీ॥

కమ—భూపాలునకతి - తాపంబడరుచు - నీపై మనమున -
గోపంబునుగన-కేపాటగునది-సైపన్ దలపఁగ॥నాథ॥

రఘు—ఆరాజవరుం - డీకీతిగనీ - నేరంబిడుచు - కారాగృహముఁ
జేరఁజొనిపిన - సైరింపనకట॥ తండ్రినిన్ను॥

రామ—శ్రీలోలుఁడుమముఁ - బాలింపునువడి -
మేలాగనిమెద - ఱీలాగునవగ - మేలా
రదుమది - జాలిఁ వదలుఁడు ॥రాముఁడెమీ॥

బల—రామదాసుగారూ ! పోదము రండు.

రామ—(చేతులు జోడించి కొండవైపునఁజూచి) భద్రగిరిపై సింహాసన స్థితుఁడవై చతుర్దశభువనంబులఁ బాలించుచుండు సద్ధర్మచక్రవర్తీ! శ్రీరామచంద్రమూర్తీ ! వందనములు. నీకు నేను సేవలుచేసిన యపరాధమునకు తానీషారాజు నన్నుఁ జెఱపట్టించి శిక్షింప నున్నాఁడు. నేను పోవుచున్నాను.

సీ. సీతా ! ధరాజాత శ్రీలక్ష్మి ! కమలాక్షి !
కావవే తల్లి ! నాకాంత నీవు
రామా ! విమలధామ ! రాజేంద్ర ! గుణసాంద్ర !
ప్రోవవే తండ్రి ! నాపుత్త్రు నీవు

సౌమిత్రి ! గురుమైత్రి ప్రేమాతిశయరీతి
భరియింపు మాయన్న ? భక్తజనుల
అంజనావరపుత్త్రి యనుకంప జనియింప
పాలింపు పుణ్యాత్మ ! భద్రగిరిని
గీ. మగిడి యే తెంతునో లేదొ మనుజపాలుఁ
డేవిధాన దండించునో యేమిగతియొ
మీకె వేద్యంబు నావిధి మీఱ వశమె
పోవ సెలవిండు నేఁ గొల్చుదేవులార !

(రామదాసు నిష్క్రమించును.)

కమ—(రామదాసు వెంటఁ బోవ నుద్యమించును.)

బల—అమ్మా ! నీవు మావెంట రాకుము. రామదాసు చేసిన నేరమును విమర్శించుటకు నతనిని రాజుగారియాస్థానమునకుఁ గొనిపోయెదము.

(అని నిష్క్రమించును.)

కమ—(నిందుమ్ఖమున) అయ్యో ! యిది యెట్టివిపరీతము ? శ్రీరాములసేవసేయుట యపరాధమా ? భక్తులు భగవంతునకుఁ దమద్రవ్యమును సమర్పించుట పాతకమా ? పుణ్యవంతుఁడని పేరొందిన తానీషాప్రభుత్వ మెట్టియధర్మరాజ్య మాయెను ? నిరంతరము శ్రీరామచరణసరోజకైంకర్యముదక్క వేరొక కార్యమాచరింపక సతతము సీతామనోనాథునిసంస్తుతిదక్క నొండొకనియతిని బ్రీతింపక, యెల్లప్రజలయుల్లంబుల నుల్లసిల్లఁ జేయుచుండిననాప్రాణవల్లభునిపైన నాథరావల్లభుఁ డూరక లేనినేర మారోపించి చెఱబట్టించె ? నాథా ! నీ వనుదినంబును

జేయుచుండిన భద్రగిరీశుని సేవ కభ్యంతర మొనర్చిన యీనిర్బంధము నెట్లోర్తువు ? రమాకాంతసంకీర్తనంబునకుఁ గలిగిన యీ యంతరాయ మెట్లంతరింపఁ జేయుదువు? అయ్యో! ని న్నా రాజభటు లెంతగాఁ గాసిబెట్టెదరో ? పూజనీయమగు భూసురవంశంబున జనించి భాగవతశేఖరుఁడవని పొగడొంది యీభద్రాచలమునకు నేలికవోలె మేలగుపరుపు గాంచినందుకు నీవు నేఁ డపరాధివైతివే ? శ్రీరామునిఁ బూజించిననీచేతులకు సంకెలలు భూషణములుగా సంఘటించెనే ? నీరామభక్తిముక్తి కారాగృహప్రాప్తి యాయెనే. ఈశోకము నే నెట్లు భరింతును? నేనెవరిని వేఁడుదును ? ఎందులకరుగుదును ? అయ్యో ! నాథా ! శ్రీరాముని నమ్మి దేహార్థప్రాణమానంబుల నప్పగించితివే? అందులకు ఫలమా యిది ?

సీ. శ్రీరామపదసేవఁ జేయుచు సకలంబు
నెడబాసినందున కిదిఫలంబ ?
నీడచాటును లేక నిలిచినరామున
కిమ్మొనర్చినదాని కిదిఫలంబ ?
చీర సొమ్ములు లేక చెఱలాడుసీతకు
నింపుగూర్చినదాని కిది ఫలంబ ?
భ్రాతలతో రఘువరునకు భూషల
నొదవించినందున కిది ఫలంబ ?

గీ. కరుణమాలినదేవుఁ డం చరయలేక
నార్తరక్షకుఁడని నమ్మి యర్థిఁగొలిచి
యర్థ మెల్ల సమర్పించి యడలె దకట !
రాముఁ డెటుగాచునో నిన్ను ప్రాణనాథ !

రఘు - పాట - (అనుబంధము. 40.)

రఘు—తల్లీ ! ఇట్టిసంకటసమయంబున ధైర్యముఁ బాయఁదగదు. మను పువాఁడును బ్రోవుచ్చువాఁడును రామచంద్రుఁడే. ఆదేవునారా ధించి గోలకొండ కరుగుదము. చక్కఁగ రాజుదగ్గఱకుఁబోయి యతనిని వేఁడుకొందము రమ్మా.

(నిష్క్రమించును.)

---

చతుర్థాంకము - తృతీయరంగము.

తానీషాగృహము—ఆస్థానము.

(సితారా పరదావెనుకనుండును - ప్రధాని మంత్రులకొండఱు)

తానీ—ప్రధానీ ! రామదాసును లోనికి బంపుము?

ప్రధా—భాగ్యము.

[రామదాసు - ప్రవేశము] (ప్రక్కనుండి.)

చ. కలుగఁడు దిక్కెఱుంగు నను గాచెడుధర్మవిచారుఁ డెవ్వఁడున్
గలుగఁడు పూర్వజన్మకృతకల్మషభారముఁ బాపుధీరుఁడున్
గలుగఁడు నిన్ను బోలుననఘాత్ముఁడుగల్గఁడు ఖిన్నుఁడైననా
కలఁగుడు దీర్పరమ్మ జనకాత్మజనాయక ! దీనరక్షకా !

మహారాజుగారికి వందనములు.

తానీ—రామదాసు ! ని న్నేమనవలయునో తెలియకున్నది.

రామ—'రామదాసు' అనియన్నారే యింకేమి ?

తానీ—నీవు చేసినమోసకృత్యమునకు ని న్నేమని పిలువవలయును ?

రామ—నేను మోసకృత్యముఁజేయలేదు, న న్నెప్పటికి రామదాసనియే పిలువవలయు.

తానీ—రాజద్రవ్య మాఱులక్షలు నాకుఁదెలియక నీవు వ్యయపఱుప లేదా ?

రామ—ప్రభువునకు విజ్ఞాపన వ్రాసికొని వ్యయపఱిచితిని.

తానీ—ఇదికల్ల. దీనికి సాక్ష్యమేమున్నది ?

రామ—కల్లకు సాక్షి లేదు. నిజమునకు దైవమేసాక్షి.

తానీ—అది యుండనీ ! నాయంగీకారములేనిదే వెచ్చ మేల చేసితివి ?

రామ—అందులకుఁగారణము తాము దైవభక్తిఁగలధర్మప్రభువులనెడు నానమ్మకము.

తానీ—నే నంగీకరించుటకు మానుటకుఁ బ్రజాపాలనకార్యములకు బ్రోగుచేయఁబడు సొత్తెవ్వరి దనుకొని వ్యయపఱిచితివి ?

రామ—దేవునిదనుకొంటిని. దేవునకే వ్యయపఱిచితిని.

తానీ—ఇది పొగరుమాట. కుత్సితవాక్కు.

రామ—ఇట్టిపలుకులు జ్ఞానులైన మీబోఁటివారు వచింపకూడదు. దైవమియ్యకున్న నాకుఁగాని మీకుగాని మఱియేమానవునకు నొక కాసు చేతనుండదు.

తానీ—నేను రాజునని భీతిలేక మాటలాడెదవా ?

రామ—పాపభీతి లేనివానికే రాజభీతియుండును. నేఁడు రాజుగనున్న మానవుఁడు ఱేపు భిక్షువు గావచ్చును. సర్వము దైవాయత్తము

(అనుబంధము. 41.)

తానీ—అపరాధియగు క్షుద్రునితో న్యాయాధిపతి యింత చనువిచ్చి మాట్లాడినది తప్పు.

రామ—నే నపరాధినిగాను. క్షుద్రుఁడనుగాను.

తానీ—నాద్రవ్యము నపహరించిన దొంగవుకావా నీవు ?

రామ—నే నెవ్వరిద్రవ్య మపహరింపలేదు. చోరుఁడనుగాను. శ్రీరాములకు నే సమర్పించినది మీ రంగీకరింపకుండినందున మీకు

నే నాఱులక్షలఋణము నివ్వవలయును. కావున నే నప్పులవాఁడ నని యొప్పుకొందును.

తానీ—అట్లేకానిమ్ము. ఇమ్ము. ఋణద్రవ్యమునంతయును.

రామ—తెచ్చియిచ్చెదను.

తానీ—ఎచ్చటనుండి ?

రామ—భద్రాచలమునకుఁబోయి శ్రీరాములనడిగి తెచ్చియిచ్చెదను.

తానీ—నేను వెఱ్ఱివాఁడనని తలఁచెదవా ? నీవు తప్పించుకొని పరుగెత్తి పోవనెంచెదవా ? భద్రాచలముననున్న దేవుఁ డిచ్చట లేఁడా ? దేవుఁడఁట ! నీచేతికాఱులక్షలధన మెంచియిచ్చునఁట ! వానిని నేను మాటగట్టుకొనవలయునఁట ! హా!హా!హా ! (అనినవ్వును)

రామ—రాజేంద్రా ! నిరుపేదనై నిర్బంధితుఁడనైన నామాటలకు నీవు నవ్వుచున్నాఁడవు. ఈరాజ్యపద్ధతి స్థిరముగాదు.

గీ. నిముషభంగురమగుఁగాదె ఏవిభూతి
సిరి భుజించి లేమి భరింపఁ దరము గాదు
అడఁకి హసియించువారికి నడలుకలుగు
నేడ్చి నవ్వంగఁదగునయ్య ! యెవరికైన.

తానీ—సీ. దుర్ణయపరుఁడౌచు దుష్కృత్యమును జేసి
నీతులుబోధింప నీకుమేల ?
నిర్వహింపఁగలేని నేరంబునొనరించి
నిందకుసమకట్ట నీకుమేల ?
రాతిబొమ్మగనుండురామునియాచించు
నికృతిమాటలనాడ నీకుమేల ?
దేవుఁడు నినుమెచ్చి దిగివచ్చి ధనమిచ్చు
నిజమంచు వచియింప నీకుమేల !

గీ. ప్రేలి కూఁతలిడఁగఁ బాపభీతిలేదె
నిక్కములె పల్కవలె ననునీతిలేదె
ఇంతమోసంబు గావింప నెగ్గులేదె
చెడుఁగుచేఁతకు నిసుమంత సిగ్గులేదె ?

ఔరా ! నేను సహించుకొలఁది నీకఱకుమాటలు పరిమితిమీఱుచున్నవి! భూలోకమున దేవుఁడు మానవునిచేతికి ధనము నిచ్చునన్నమాట నెట్టి యున్మత్తుఁడైన నమ్మునా ? నీవు మోసచిత్తంబున దుష్టుఁడవై—

రామ—నరపాలా ! చాలింపు-మీపరుషభాషణములు. నీవు పరిహాసములుగ భావించువిషయములను వాస్తవములుగఁ జేయరాముఁడు శక్తుఁడు. నీఋణముఁ దీర్పను సమర్థుఁడు.

తానీ—భుజంగప్ర. దురాలాపముల్ బల్కుద్రోహంబుచాలున్
విరోధంబు పర్వించువీర్యంబు చాలున్
పరా కొందకన్ సప్తవారంబులందే
ధరాదేవ ! యర్పింపు ద్రవ్యంబునెల్లన్.

అట్లయిన నీకు నేఁడుదినములు గడువిచ్చెదను. నాధనమ్ము నొసంగుము, నీసత్యము తెలియవచ్చును.

రామ—కానిమ్ము.

భుజంగ—నిరాధారుఁడై నిల్చునిర్భాగ్యుఁడైనన్
పరాధీనుడైయుంటు పాఱుండనైనన్
పరీక్షింపుమా సప్తవారాంతమందే
ధరాధీశ ! యర్పింతు ద్రవ్యంబు నెల్లన్.

తానీ—దీనికి నీవు తప్పిన నేమిశిక్ష ?

రామ—ఆబుణధనంబునకు మాఱుగ నాశిరము నర్పించెదను.

తానీ—కానిమ్ము. బలవంతరావ్! ఇతనినిగొనిపోయి సప్తవాసరములు కారాగృహమందుంచుము. ఎనిమిదవనాఁడుదయమున నితనిని నాయెడకుఁ గొనిరమ్ము.

బల—చిత్తము. (రామదాసుని గొనిపోవును.)

(నిష్క్రమించును.)

[ప్రవేశము - సితారా.]

సితా—నాథా! యీరామదాసు మహాపురుషుఁడు. నీకు పోలువాఁడు గాఁడు. అతని దైవభక్తికినైన మెచ్చకపోయితివే ?

తానీ—మెచ్చి యేమిచేయవలసియుండెను ?

సితా—పైకము తెచ్చియిచ్చెదననినంతనే యతనిని విచ్చలవిడిగ పంప వలసియుండెను.

తానీ—అట్లొనర్చినఁ బ్రజలు నన్ను బిచ్చివాఁడనుచుండిరి.

సితా—

(అనుబంధము 42.)

రామదాసు ధనముచెల్లించిన నప్పు డేమందురు ?

తానీ—కానిమాటలకుఁ జర్చయేల ?

సితా—అతఁడు పైకమివ్వకున్న నేమిచేయ నెంచియున్నావు ?

(వెలుపల - ఏడ్పుధ్వని - కమల - రఘురాముఁడు)

కమల—(ప్రక్కకువచ్చి యేడ్చుచు) మహారాణి! ఎందున్నావు ? నా మొఱ నాలకింపరమ్ము. రక్షింపుము.

పాట - నం. 43 - రాగము - ధన్యాసి - తాళము రూపక.

కరుణామతులైనవారు - గలరేధర నెవ్వరైన ।

ధరణీశునిమనమందునఁ - దయఁగూ
ర్పెడుధర్మపరులు ॥కర॥

1. భూనాథుఁడు నేరమెంచి - పోనాడుచు
చెఱనుంచెను ।

మానాయతి గల్గు ఘనులు నానాథు
నిఁ బ్రోవరారె ॥కరు॥

సితా—ఎవ్వరక్కడ? (అనిముందఱికివచ్చిచూచి) అమ్మా! కమలాంబ! నీవా? కొంచెము తాళుము. నానాథుని లోనికిఁబంపెదను.

కమ—వలదు, వలదు. రాజేంద్రుఁడు నాతండ్రి. నీవు నాతల్లివి. మీయిద్దఱిచరణముల కభివందించి ప్రార్థించెదను. నా నాథుని గాపాడుఁడు. (అని కాళ్ళఁబడును.)

రఘు—రాజేంద్రా! మహారాణీ! నాజనకునిఁ బాలింపుఁడు. అతఁడు నిరపరాధుఁడని శ్రీరాముఁడే చెప్పగలఁడు. నాతండ్రిని నా కొసంగుఁడు.

తానీ—బాలకా! అప్పుతీరవలయునుకదా?

రఘు—నేను తీర్చెదను. నేనుచచ్చువఱకు మీసేవ చేసెదను. నాతల్లితో దాస్యము పుచ్చుకొనుఁడు. నాతండ్రిని విడువుఁడు.

తానీ—అమ్మా! నీనాథుఁడేడుదినములకు ద్రవ్యమునిత్తునని ధైర్యముగ వాగ్దానముఁ జేసియున్నాఁడు. ఏలవిచారము? ఏమి చెడుగైనది?

కమ—రాజచంద్రా! గౌరవహానికన్న నెక్కుడు కీడేమికావలయును. పరిభవంబుకన్న మరణము మేలుగదా? చెఱలోనుండు నతఁడు పైకమెట్లు తేగలఁడు? మీ కనుమానమున్న నన్ను, నాకుమారుని జెఱలోనుంచి నానాథుని విడువుఁడు.

పాట - నం. 44 - రాగము శ్రీరాగము - తాళము ఆది.

నరపాల ప్రేమఁబూనుమా
కరుణనునీమదిలోఁ గనుమా

1. కాంతునిఁగావుము - కడుదయతోడను ।
పంతముమానుము - స్వాం-తం-బు-లో-న॥ నర॥

2. పావనచరితుఁడు - నీవనుయశమును
భావింపుము - బా-లిం-పు-దేవా॥ నర॥

తానీ—అమ్మా! అది కానిపని. ఎంతవేడినను ఫలములేదు.

కమ—జనపాలా! నీవు ధర్మనిరతనిర్మలచారిత్రుఁడవనియు, కరుణాభరిత స్వాంతుఁడవనియు, విఖ్యాతినిగాంచి దీనులైన మాయెడనా యిట్టి నిర్దయావిక్రాంతివహించియున్నాఁడవు? నేను విపన్నురాలనై యుంటచేత నాయంతరంగములోని నిజమైనవంతను భగవంతునిసన్నిధిఁబోలె నీయెదుట వెల్లడిపఱచి నన్నురక్షింపఁ బ్రార్థించెదను. నీవు నిష్పక్షపాతచిత్తుండవగు క్షోణీశుఁడవుగదా? నాతండ్రి నిన్నుఁ గూరిమితోఁ గొలుచు నమాత్యుఁడుకాదా? నానాథుఁడు నీకు ధనము నీయవలసియుండిన నాజనకునకుఁ దెలుపక యతని నిమ్మని యడుగక విమర్శయొనరింపక నీఋణ ధనమునకన్న నధికమగు నాతండ్రిసొత్తును బలాత్కారముగఁ గైకొంటివి. నావిభుని జెఱపట్టించితివి. ధన మొసఁగుటకై యేడు దినముల యవధి నీవిచ్చియు నిష్ఫలమగునట్లతనిని వెలికివిడువక నిర్బంధించితివి. ఇది నీవు న్యాయమందువా? ధర్మమందువా? నీకు కరుణలేదాయెనా?

శా. లేదే సాధుజనాళిపైన కరుణాలేశంబు క్షోణీవరా!
కాదే పాపము దైవభక్తు నిటులన్ గాఱించిబంధింపగా

పోదే కోపము దీనచిత్తయగుచున్ బూఁబోణి ప్రార్థించినన్
రాదే మాగతిఁగాంచి నీకు దయ యో రాజేంద్ర! రక్షింపవే.

రాజేంద్రా! యిప్పుడైనను నాజనకునిసొత్తునుండి నానాథునిఋణముఁ జేకొని మమ్ములఁ గాపాడుము.

సితా—నాథా! కమలాంబవిన్నపము నంగీకరింపవచ్చునే.

తానీ—కాంతా! నాకుఁ జాలపనులున్నవి. నేను బోయెదను. వీరిని త్వరలోఁ బంపుము. (నిష్క్రమించును.)

కమ—తల్లీ! ఈసమయమున నీవే మాకుదిక్కు..

సితా—కమలాంబా! నిమ్మళింపుము.

పాట - నం. 45 - రాగము కాపీ - తాళము రూపకము.

అతివా! యీశోకాన - నడలకుమమ్మ।
అపాయంబిసుమంత, నినుఁజెందదమ్మ॥ అతివా॥

1. సర్వాత్మ(గృపగాంచు - సత్వుండునీవిభుడు।
సత్యంబుఁగాపాడు - సౌఖ్యంబుగూడు॥ అతి॥

2. పరమాత్మభజియింపు - భక్తులకెపుడును।
పరితాపఘోరంబు - పొరయకనుండును॥ అతి॥

సితా—అమ్మా! నీప్రాణేశ్వరుఁడు సామాన్యపురుషుఁడుగాడు. ఆవిచారణ నంతయు నే వింటిని. రాజుతో భీతిలేక భాషించి నిండుధైర్యముతో రాముఁడు ధనము నిచ్చునని చెప్పెను. ద్రవ్య మీయకున్న నెనిమిదవనాఁడు తనశిరము నిచ్చెదనని చెప్పెను.

కమల పాట-(అనుబంధము 46.)

హా రామచంద్రా! ఇంక నెనిమిదిదినములకు నాప్రాణకాంతుఁడు నన్నుఁ బాసి పోవుననితలచి ప్రాణముల భరింపఁజాలుదునా? నాయసువుల నిప్పుడే పాసెదను. (అని పోవుచుండును.)

సితా—(అడ్డగించి) అమ్మా! సాహసమేల? సహింపుము.

కమ—రాజపత్నీ! నానాథుఁడాడినమాటఁ దప్పువాఁడు గాఁడు. నాకు ముందేమిగతి రానున్నదో యిప్పుడే ప్రాణముల నీగికొందును. అమ్మా! మాపైన వైరముమాని కరుణనుఁ బ్రసరింపుము.

పాట-నం 47-రాగ-మిశ్రఅసావేరి-ఆది.

కమల—
సిత— } (ఇద్దరు పాడు సంభాషణ)

కమ—సారంగాక్షీ మాపై నింతటి,
ఘోరంబా వైరంబేలా॥ సారం॥
సితా—ఆ రాజేంద్రుఁడు నేరంబెంచిన
నేరీతిగ వైరంబగును? ॥ ఆరా॥
కమ—వరరాణీ, ప్రేమానగరుణించి।
పరితాపంబాఱ్పుమా, పరికించి।
మొఱనాలింపన్ - గణ్యమగున్
పరిపాలింపన్ బుణ్యమగున్॥ సారం॥
సితా—ఘనవేణీ! యీరీతిన్ ఘనతాప।
మును జెందిశోకింపన్ గననోప।
వనటన్ బొందకు, చాలగను।
వనితా! నీకిఁక, మేలగును॥ ఆరా॥
కమ—చెలిలో నాప్రాణేశున్ జొరజేసి।
పరిభావంబొందింపన్ బదుగాసి।
తరుణీ యీవగఁ దాళుదునా?
భరియింపగ నేఁ బోలుదునా?॥ సార॥

సీతా—హరిదాసుండౌ నాథుండరుదైన ।
పరిపూతుండై పొల్చుఁ ధరపైన ।
అరయఁ నీస్థితి, యోగ్యముగా ।
పరికింపగ నీ, భాగ్యముగా॥ ఆరా॥

రఘు—జననీ! బావిలో పడియుండిన నాప్రాణమును దీసికొనకమానిన రామచంద్రుఁడు తనకుఁగాను నా తండ్రి చేసిన యప్పునకు నతని శిరము నీయనిచ్చునా? రమ్ము పోవుదము భద్రాద్రికి. ఈసప్త వాసరంబు లహోరాత్రంబు లఖండోపవాసములు చేయుచు శ్రీరామచంద్రుని చరణములదగ్గఱఁ బడి యుందము. అతఁడు రక్షించును.

(నిష్క్రమింతురు.)

చతుర్థాంకము - సమాప్తము.

శ్రీరస్తు.

# రామదాసు

## పంచమాంకము.

ప్రథమరంగము - చెఱసాల ముందటిభాగము.

[కావలివాఁడు అహ్మక్ షా.]

అహ్మ—పాట

(అనుబంధము 48.)

మైనే, నిహాయత్, ఉందా,
సబక్, సిఖ్ లియాహుం లాతా
హుం కిజ్రానజీకేతవంగర్ లేతా
హుం మోతీ, హీరేకా, జవా
హార్-జబ్ మిలేహై జర్ వో, జే
వర్, బిలాదాం-తబ్ పుట్లీహై
మేకీప్యారీ, గుల్ అన్ దాం-మేరా
యారోంకు కరుంగా, ఖుర్రం, ఖు
ర్రం-సాహుకారోంకు, కరుంగా, ద
ర్శాంబర్శాం-తకాజేకు, కహుంగా
నకరోజులుం ఖజానాహై, చలో
భద్రాచలం-హిరాసత్ మే, రహుం
గా, బఅరాం. ఫరాగత్ సే, పుకా
రుంగా, రాం, రాం, రాం.

సీ. శహబాసురాందాసు
బహుతచ్ఛపాతాన్కి
నేర్పించె నందర్కి
నేనుసెప్త
నాసేతికెవడైన
నమ్మిపైసాయిస్తె
మింగేస్త పెండ్లాంతో
రంగుసేస్త
యాకుల్కు ప్యారీల్కు
దారుసేందిషరాబు
తాగిస్త జల్సాలు
దండిసేస్త
దుడ్డుపోగొట్కొన్న
దోస్తుకు నేసెప్త
భద్రాశలంపోయి
పైస తెస్త

గీ. ఖైదిలోపెడ్తె కూర్చుండి
కండ్లుమూస్తె
యార్లతోసేస్ని గమ్మత్తు
యాదిసేస్తె
పేటులోఖుషిపైకొస్తె
పాటపాడ్తె
షోకుతోడ రాం రాం అని
కేకలేస్తె.

[ప్రవేశము - కలందర్ బేగ్ - అధికారి.]

అహ్మ—ఆదాబ్ అరజ్ హైకలందర్ బేగ్ సాహేబ్కు.
కలం—ఆదాబ్ అహ్మక్ షా, క్యా ఖబర్ హై ?
} వందనము స్వామీ ! అహ్మక్ షా! ఏమివార్త?

| | |
|---|---|
| అహ్మ—యేకరజ్ దాక్ రాందాస్ బడామక్కార్, అవుర్, జాదూ గర్ హై. | ఈరాందాసుఁడు మిగుల టక్కరి. ఐంద్రజాలికుఁడు, |
| కలం—యే క్యాబాత్ కహ్తేహూ? | అట్లేలంటువు ? |
| అహ్మ—సునో సాహేబ్! మైనేము తాబికె, హుకుంసర్కారీ. హర్ రోజ్ ఆగ్ మేలో హేంకా సలాఖ్ జలాకర్ రాందాస్కా - పీట్ పర్ దాగ్ దేనేకేలియే జాతాహుం మగర్ మై క్యాకహుం - సలాఖ్ దేఖ్ తేహీ, వోపుకార్తా రాం రాం, సలాఖ్ హోజాతీ, నం. నం, వోబోల్తా, ఎక్ హీ హారఫ్- ఆతష్ హోజాతి, ఘారనె, బరఫ్-వోకియా పైసా, సరఫ్-బల్లాయా, ఖుదా | స్వామీ ! వినుము. మీయాజ్ఞ మేరకు నేను ప్రతిదినము నిప్పునందు లోహపుసలాకు యెఱ్ఱఁగఁగాచి రాందాసు వీపుపైనవాఁత వేయఁబోయెదను. కాని నేనేమిచెప్పుదును? సలాకు చూడగనే వాఁడఱచును. రాం, అని గొల్లుగ- వెంటనె సలాకగును చల్లగ, వాఁడేడ్చును రాం, అంచు అగ్గియగాను మంచు, వాఁడుభ్రమింగె మనగంటు - చూపె దేవుని తట్టు. వాఁడు చేయుచున్నాఁడు, దయ్యము |

కా, తరఫ్-కరీం,పర్, హై, ఉస్కా-
కలఫ్ - కరీబ్, పర్ హైహమారా
తలఫ్-సునావ్, బాద్షాకు, యే
ఖబర్ బనావ్ జల్దీ యేబద్
మాష్కా, కబర్.

కం—అచ్ఛా! మై, అబీ, జాతా
హుం, బాద్షాకె ఖిద్ మత్ మే
రహో హుషియార్ సే.

ధ్యానము - ఇక్కడ పోవుచున్నది.
నా ప్రాణము. చెప్పుము రాజునకీ
వార్తనంత - త్రవ్వింపుము వేగమే
వానికిగుంత.

మంచిది. నే నిప్పుడె రాజుగారి
సన్నిధికిఁ బోయెదను. నీవు కడు
జాగ్రత్తగ నుండుము.

(నిష్క్రమించును.)

---

## పంచమాంకము - ద్వితీయరంగము.

(చెరసాల - రామదాసు.)

రామ—సీ. కరిరాజవరద ! నే శరణువేడినఁగాని
కరుణ నీమది నేల గలుగదయ్య
పద్మాక్ష ! నాపాపభరమింక నెందాఁక
విలపింపఁజేయునో తెలుపవయ్య !
శ్రీనాథ ! నిరతంబు నీనామభజనంబుఁ
జేసినఫలమేమొ చెప్పవయ్య !
ఇందిరారమణ ! నే నెంతపాతకినైన
నెందును నిను నమ్మి యుంటినయ్య !
గీ. ఏల ? కృపగల్గదేల ? నాజాలినివిన
వేల? నాబాధలనుజూడవేల? కోప
మేల ? మాటాడవేల? నీకింతచలము?
చాలునాస్వామిరామ ! నన్నేలుకొనుము.

పాట - నం. 49 - ముఖారి రాగము - ఆదితాళము.

దయగనికావవయ్యా - దశరథతనయ ।
రయమారనన్ను జేర - రారసీతారమణ!
రామనిన్ వినావేరు - రక్షకులే లేరు ॥దయగని॥

1. ప్రేమతో నిన్నెనమ్మి - విలపించుదీనుఁడు ।
పిలిచినఁబలుకవే - వినవొల్లవేమొఱను ।
నీమదినేమున్న - నిన్ను నేవిడలేను
సామజపతిపాల ! రామనీదాసుఁడను ॥దయగని॥

రామచంద్రా ! చిన్నవాఁటనుండియు నాపాలిటికన్నతండ్రివి నీవేయని నిన్నుమానక నిమురయందైనను మఱవక ననవరతము నీచరణసేవారక్తుఁడనై యున్నాఁడనే. నీవొసంగిన యీభంగురదేహము సర్వాంగములతోడ నీమంగళకరసేవా సాంగత్యప్రసంగములయందే మెలంగుచున్నదే ? నను చెఱయందునిచి నిర్బంధించిన నిన్ను నిరసింతునని తలంచితివా ? నీరజాక్ష ! నిరుపమతారహారరుచిరాలంకారకాంతిపూరతిరస్కృతమారాకారంబగు నీశ్రీకరాకారంబునకు నమస్కారము నరింపక నాశిరము విసరవోవునా ? మౌనిబృందబృందారకసందోహార్చితానందభక్తమందారంబగు నీపాదారవిందంబు స్మరణసలుపక నాడెందము డిందుపడియుండునా ? చేతోభయాకంపితానంతాప్తసంతాన సంతాపసంహర్తవగు నిన్ను సంస్తుతించి జోతఁజేయునాచేతులు కాతరమొందునా ? రామా ! నీవేల నన్నింతమున్నహరీతిగఁ బరీక్షించుచున్నావు ? ఈకారాగృహమందుండుటయే కాదు, లోకభయంకరశరభశార్దూలంబులవాతను నన్నుప్పగించినను, క్రూరజలజంతు వితానపరిపూరితంబగు పారావారంబున ననుఁ బాఱవైచినను. కరాళసర్పంబులచే గఱపించినను, దావానలజ్వాలలలో నన్ను దహింపఁద్రోసినను

నీనామకీర్తనను నేను మానుదునా? అనంతశయనా! అనన్యగతికుండనగు నే ననన్యాదృశమహనీయసత్వగుణోపేతుండవగు నిన్నుంగాక యన్యుని నమ్మెదునా ?

ఉ. నమ్మితి నీవె దిక్కని యనాథశరణ్యా! వరేణ్యా! కేశవా!
నెమ్మిగ నిమ్ము రక్షణము నేరము లన్నియుంగాచి మాధవా!
ఇమ్మెడిం జెందుతాపముల నెంతని నేసహియింతురాఘవా!
రమ్మిక నేల తామసము ? రమ్ము భరింపుము జానకీధవా ?

పాట - నం. 50 - వరాళి రాగము-రూపకతాళము.

నీపాదమే నే నమ్మినాను రామ !
ఆపద్బాంధవవేగ - కాపాడు కదుప్రేమ॥ నీపాద॥

2. శ్రీరామనిరతంబు - సేతు నీభజనంబు ।
కారుణ్యమెంతైన గలుగదె నీమదిలో ॥నీపాద॥

3. వైరమెంతగనీవు - సారించిననుగాని ।
సారసనేత్రనీ - చరణంబుమాననను॥ నీపాదమే॥

శ్రీరామా! నీవు దశరథరాముండవై యనుభవించినసంకటము లనించుక స్మరణకుం దెచ్చుకొనియైనను నాపైనంగరుణింపుమా? సీతా వియోగపరితాపమున వనరుచు నావనజాక్షిని వెదకింప నెంతగనాతుర పడితివో ? యుద్ధరంగమునం గూలియుండిన నీతమ్ముని లక్ష్మణునిరక్షిం చుటకై సంజీవపర్వతముం దెప్పింప నెంత వేగిరపడితివో ? నీవు మఱచితివా? నమ్మినభక్తు నెడనా నీకింతతామసము ? ఇంత నిస్పృహయా ? ఇంత నిర్దయయా ? నళినాక్షా! రాత్రియనక, పగలనక, నీసేవంజే యుచున్నానే? నీకొఱకు బీదనైతినే ? ఋణముంజేసితినే ? చెఱంబడితినే ? ఇంతైనను నీకింకను గనికరము రాకున్నదే ?

(అనుబంధము 51)

(గంటలుమ్రోగును ఆలకించి.)

ఆహా! ఇది యాఱవదినము. ఆఱు రుప్యాలైన నాచేతలేవు. మరల రాజభటులు నన్ను బాధింతురు. ఎంతటికని యోర్చుకొందును? రామా! ఈదుస్సహంబగు హింసచేతను గాసినొందించుటకన్న నొక్కసారియే నను సంహరింపరాదా! సరళఫలవంతమైన నీస్వాంతము గరళప్రాంతరమైయున్నదేల? వెన్నముద్దలు మ్రింగిన నీహృదయము పాషాణమెట్లాయెను? భక్తపోషణానందబాష్పములు వెదచల్లు నీకటాక్షము కటారియెట్లాయెను? దర్శింపవేడిన సకలసాధువులకు ప్రత్యక్షమగుచుండిన నీముఖము పరోక్షమెట్లాయెను? శరణాగతుల కభయప్రదమైయుండిన నీహస్తము భయప్రద మెట్లాయెను? చేరఁదాకిన రాతికి సహితము శ్రీపదాకరమైయుండిననీపాద మాపద కాకరమెట్లాయెను? పుండరీకాక్షా! అఖండభూమండలంబున నిండియుండిన నీదివ్యప్రభావము ముగిసెనా? నీదేవతాసామ్రాజ్య మేరాక్షసుఁడైన నపహరించెనా? లేక రాముఁడని వేఱుదైవమును నేగొల్చుచున్నాఁడనా? నా సంతాపమున కంతమెట్లు కలుగును? నాగతి యేమగును?

పాట- నం. 52- రాగమునీలాంబరి-తాళము-రూపకము,

కాపాడుమురామ! కారుణ్యగుణధామ! నాపాలిగురు
దైవమా॥ కాపాడుము॥

1. నాపాటుగనవేల - తాపమాఱ్పవదేల,
నీపాదమేనాకు - ప్రాపింకరామా॥ కాపాడుము॥

2. సాకేతనాయక! నీకింకఁగృపరాదె॥
శ్రీకాంత నిన్నెందు - సేవించెదనుకాదె॥ కాపాడు॥

(ఊటుటతో) ఎంతదుఃఖించినను నే ధరణిపైనుండునది యిఁక రెండుదినములేకదా? ఈతనువుపోయినపిమ్మట న న్నెవరుబాధింపగలరు? నాకేమిభయము? (యోచించి) ఆహా! బ్రతికియున్నప్పుడుగల శోక భారమునకన్నను మరణానంతరము గలుగఁబోవు యపకీర్తిభార మత్యంతభయావహమైయున్నదికాదా? రామదాసు రాజధనము నపహరించి రాజశిక్షకులోఁబడి ఋణస్థుఁడై పోయెనను నపశయ మాచంద్రార్కము వసుధపై స్థిరముగనిలచునే? నామాట లటులుండఁగ నాకాంతా సుతులస్థితి యేమగును? నన్నుబోగొట్టుకొని యనాథలై, నిఱుపేదలై, యపనిందపాలై యూటలేక, దిక్కులేక, కూటికిలేక, చెట్లు, గుట్టలఁ జేరి, యాకులలములదిని, కృశించి, నశించి, నను దూషించి మృతిఁజెంది వాయస గృధ్రసృగాలములనోటికిఁ బడుదురుగదా! ఆహా! తలప నశక్యము! దుర్భరము!! అతిఘోరము!!!

రామా! ఇన్నిసంకటములకు నీవుకారణము. నీవు దీనపోషకుఁడవనియు, శరణాగతభరణుఁడవనియు, నెన్నియోబిరుదులు పెట్టుకొని నన్ను వంచించితివి. నీవు పాండవులఁ బాలించినది పొల్లు. కరినిగాచినది కల్ల. నీపెద్దఱికమంతయు నెద్దడి. నీసత్యమంతయు రిత్త. నేను మోసపోయి నిన్ను నమ్మితిని. నాదేహము నీకమ్మితిని. నాధనమంతయు గోల్పోతిని. ఋణముఁజేసితిని. నీపాదములయొద్దనుండి బత్తెములేనికొలువు జేసితిని. చెఱనుబడితిని. నావారిబ్రతుకును జెఱచితిని. చావను సిద్ధపడితిని. నీవు కైలాటకాఁడవని యిప్పుడెఱిఁగితిని. తెమ్ము నాద్రవ్యమంతయును. నాకొంప పాడుచేసి చల్లనిమేడలో గూర్చుండి శృంగారముఁ జేసికొని భార్యతో ముచ్చటలాడుచున్నావా?

(అనుబంధము 53,)

నా అప్పునిమ్ము, ఇవ్వకున్న నీతండ్రి దశరథునితోఁ జెప్పెదను. నీవు కపటనాటకుఁడవంచుఁ బ్రపంచమంతయు బ్రసిద్ధిఁజేసెదను. నన్నుఁ గా

పాడను నీచేతఁగాదని తొలుత నేలచెప్పవైతివి ? ఇప్పుడేమాయెను ? నిన్నుగాపాడినవారు సుగ్రీవవాయుపుత్రులున్నారు. వారిశరణుఁజొచ్చెదను ? (అనినడచి) రామా ! వచ్చితివా ? కరుణగలిగెనా ? అయ్యో ! నేనెట్టినిష్ఠురములాడితిని ? తాపమునఁ బలికిన నామరాలాపములను బాటింపకుము. తాళలేక నినుఁదూలనాడితిని మన్నింపుము. పుత్రుఁడెంత దుష్టుఁడైనను తండ్రిపోషింపకున్న మఱియెవ్వరు పోషింతురు. క్షమింపుము. రక్షింపుము. (ధ్యానపరవశుఁడై శ్రీరామదండకము చెప్పును.)

శ్రీరామదండకము - దశావతారకీర్తన.

శ్రీరామ! శ్రీవాసుదేవా! హృషీకేశ! వైకుంఠవాసా! వికాసా! యసాదృశ్య ఖద్యోతసాహస్రసంకాశదేదీప్యమాన ప్రకాండప్రభాయుక్త భూసత్యపాతాళస్వర్గాదిలోకప్రకాశా ! మణీమూఢ ! శ్రీవత్సకేయూర కోటీరమాణిక్య హేరాళహీరాళ సంకీర్ణ సౌవర్ణహారాద్యలంకార ! సమ్మోహితాశేషగీర్వాణగంధర్వనాగేంద్ర యోగీంద్రసద్భక్తసంఘా ! గదాశంఖకౌమోదకీచక్ర దివ్యాయుధానంత శస్త్రాస్త్రసంక్షిప్త బాహు ప్రభావాంతరీభూతదైతేయ దుర్వృత్తగర్వాంధనిర్వేద వైరిప్రకాండా ! శుభాంగా ! సుసంగా ! సుభూషా ! సురేశా ! సునందా ! ముకుందా ! బుధానంద ! నందాత్మజా ! మందరోద్ధార ! గోవింద ! శ్రీసచ్చిదానంద! వేదాంతవేద్యా ! నిధానా ! ప్రదానా ! ప్రధానా ! ధురీణా ! యగణ్యాభిధానా ! యనూనాభిమానా ! సమీచీన !

మీనంబవై వేదసంఘంబు సాధించివాగీశుకందియ్యవే దేవ !

కూర్మంబవై మందరంబెత్తి సంద్రంబులోఁ జిక్కి మేలౌ సుధన్ దేల్పవే దేవ !

వరాహరు పాసదుర్వృత్తలంబెత్తి దైత్యున్ హిరణ్యాక్షుఖండింపవే దేవ !

శ్రీనారసింహుండవై రాక్షసున్ద్రుంచి ! ప్రహ్లాదుఁ బాలింపవేదేవ !

శ్రీవామనుండౌచు భిక్షుఁడై బలిఁ ద్రొక్కి బ్రహ్మాండమందంత సొం
పొందవేదేవ !

శ్రీభార్గవుండౌచు శౌర్యంబుతో రాజపుంజంబు భంజింపవేదేవ !

శ్రీరామచంద్రుండవై రావణుంజంపి లోకంబు రక్షింపవేదేవ !

శ్రీకృష్ణసంకర్షణాఖ్యల్ చెలంగన్ భువిన్ బుట్టి భక్తాళిరక్షింపవేదేవ!

శ్రీబుద్ధదేవుండవై భక్తసంతానముఁ మోద మొందింపవేదేవ !

శ్రీకల్కివై పాపజాలంబు మాయించి ధర్మంబు పాలింపవేదేవ !

రాజీవనేత్రా! శునాసీరమిత్రా! పవిత్రా! విచిత్రా! జగత్త్రాత! బ్రహ్మంబు, ధర్మంబు, నీశుండు, శ్రీశుండు, నిర్మాతయున్, దాతయున్, త్రాతయున్, సర్వమున్నీవె, రక్షింపు లక్ష్మీశ ! యక్షీణకారుణ్య! దాక్షిణ్యవీక్షాకటాక్షా! విపక్షాళిశిక్షా! సుపక్షా! జగద్రక్షణాదీక్ష! హేసత్యసంకల్ప! సంఫుల్లసల్లాప! నిర్ధూతతాపా! పరంజ్యోతిరూపా ! ప్రమోదాభిలాపా ! వినోదానులాపా ! సువిచ్ఛిన్నపాపా ! విరాజత్కలాపా ! సుయోగీంద్రహృత్కంజవిన్యస్తతేజః ప్రతాపా ! యశోదీప ! సౌజన్యసంకీర్తనా ! భవ్యనామా ! సుధామాధురీయుక్తధీలోకసంస్తుత్యసూక్తిప్రధామా ! యరిచ్ఛేదనాధుర్యతీవ్రాసిధామా ! వివేకాభిరామా ! ధరాభృల్లలామా ! నమస్తే మహోద్దామ ! శ్రీపద్మనాభాయ దివ్యోపగీతాయ భవ్యోపనీతాయ విద్వేషవర్గాయ విద్యోతసర్గాయ భక్తాపవర్గాయ ధుర్యాయ సూర్యాయ నిత్యాయ సత్యాయ పాపిఘ్నాయ తాపిఘ్నాయ రామా ! నమస్తే దయాళో ! హరీ ! శార్ఙ్గి ! పీతాంబరా ! చక్రి ! కంసారి! శౌరీ! బలారీ ! మురారీ! నమస్తే నమస్తే నమస్తే నమః

[ప్రవేశము చాందీ]

చాంది—రామదాసుగారూ! రామదాసుగారూ! అయ్యా! లెమ్ము (అని పిలుచును.)

రామ—(దిగ్గున లేచి) ఎవ్వరక్కడ?

చాంది—నేను సీతాంబను!

రామ—తల్లీ సీతాదేవి! నారాముఁడు నిన్నుబంపెనా! లేక నీకే దయ గలిగి వచ్చితివా? నీచరణములకు—

చాంది—అయ్యా! నేను మీయూరిశంభుశాస్త్రిల సీతాంబను.

రామ—(యోచించి) శంభుశాస్త్రిలు యెవ్వరైననేమి? అమ్మా! నా కమలయు రఘురాముఁడు క్షేమముగానున్నారా?

చాంది—వారికిని నీకును క్షేమము గలిగించుటకొఱకే నేను వచ్చియు న్నాను.

రామ—అట్లయిన నీవు సాక్షాత్ సీతాదేవియే యని యనుకొందును.

చాంది—నీవు మొదట నేను చెప్పినట్లుచేసి పిదపనేమైన ననుకొనుము.

రామ—నే నేమిచేయవలయును?

చాంది—వినుము. నీకమలాంబయొక్క శోకమును నేను చూడలేక సితా రాబేగంరాణియొక్క కాళ్ళపైఁబడి వేఁడుకొంటిని. ఆమె కనిక రించి నిన్నురహస్యముగఁ జెఱసాలనుండి తప్పించి భార్యాపు త్రులతో దూరదేశమునకుఁ బంపు నేర్పాటొనరించియున్నది. నీ వీరాత్రి సిద్ధముగ నుండుము.

రామ—అమ్మా! ఇది వంచనకృత్యము. నేనొప్పను. ఋణవిముక్తుఁడను గాక మాటదప్పి యీనీచశరీరమును గాపాడుచు భూమిపై బ్రతి కియుండుట కిప్పుడున్నది చాలక యింక నెక్కుడగు పాపము సంపాదింతునా?

చాంది—అయ్యా ! నీవు మూర్ఖత వహించిన నీసతీసుతులు దురవస్థల పాలగుదురు.

రామ—అమ్మా ! నే బోయినపిదప వారిని పరిపాలింపను బొరిపుచ్చును నారాముఁడు స్వతంత్రుఁడు.

చాంది—అయ్యా ! నీసతి నిద్ర లేక యాహారము లేక కంఠగతప్రాణమై యున్నది.

రామ—నాకమల యీవంచనకు సమ్మతించెనా ?

చాంది—సమ్మతించినది.

రామ—కల్ల. నేను నమ్మను.

చాంది—నిజమని బాసఁజేసెదను.

రామ—ఇట్టి యన్యాయసందేశమునకు వచ్చినదాన వెట్టిబాసమైనఁ జేయుదువు.

చాంది—అయ్యా ! చేతికిదొరకిన పెన్నిధి—

రామ—పెన్నిధికాదు. అదిపాపనిధి. చాలింపుము. ఎక్కువ పలుకకుము. పొమ్ము. నారాముఁడప్పుడీర్చునని యాకమలతో వచింపుము. ఇక్కడ నిలువకుము. (అనిధ్యాన మొనర్చును.)

[ప్రవేశము - అహ్మక్]

అహ్మ—బాయీ ? బైట్కీనికలో బడాదేర్ అయింది.

చాంది—(ప్రక్కకు వచ్చును.)

అహ్మక్—నీవు పోతుంది వస్తుంది. అంధమాదిసూస్తుంధి. యజ్మానీ నాకి తిట్టుంది. నౌకిరీ పోయిడుస్తుంది. నామెడాకిపడ్తుంది. మేరీ మాషూక్ చాంది చలోతయార్ హైసేంది.

(నిష్క్రమించును.)

## తృతీయరంగము.

### చెఱసాల ముందటి భాగము.

[ప్రవేశము-కబీర్ దాసు]

కబీ— (అనుబంధము. 54.

[ప్రవేశము - తానీషా మాఱువేసమున]

తానీ—యోగీశ్వరులకు వందనములు.

కబీర్—భూపాలునకు శుభమగుఁగాక.

తానీ—మహాత్మా ! నన్నేల భూపాలుఁడనెదవు ?

కబీర్—రామచంద్రుఁడు నీమాఱువేషమును గుర్తించి జరుగువిషయములనన్నిటిని వీక్షించుచున్నాఁడు.

తానీ—మంచిదాయెను. యోగీంద్రా ! నీరామదాసును కాపాడుట నీచేనున్నది.

కబీర్—అది నాచేతను లేదు నీచేతను లేదు. ఆరామునిచేతనున్నది.

తానీ—ఉండనీ ! నీవు చెప్పినకార్యము రామదాసు చేయునుగదా ?

కబీర్—అదేమివిషయము ?

తానీ—తొలుతనుండియు నాకు రామదాసుపైనఁ గనికరముగలిగియున్నది. ప్రజలకును యోధులకునువెఱచి నే నతనిని జెరయందుంచితిని. నాకు దెలిపియుదెలుపక నావా రతని హింసించుచున్నారు. అతఁడు దప్పించుకొని పరుగెత్తిపోవునుపాయమున కొప్పఁడాయెను. నావారు నిర్బంధముగ భద్రాచలదేవతాభరణము లమ్మి దేవాలయమును మహమ్మదీయపాఠశాలగఁ జేయుట కాజ్ఞను బ్రకటించి రామదాసును విడుదలఁజేయవలెననుచున్నారు. ఇదిమతవిషయముగావున హిందువులనొప్పిం

పరాదని రామదాసుతో నీవిషయము మాటాడవచ్చితిని. నీవుఁ దటస్థించితివి. ఎట్లయినను రామదాసును సమాధానపఱుపుము. లేదేని రేపుదయ మతనిశిరముపోవును.

కబీర్—ఇట్టిమాట నేను జెప్పను. ఎవరుచెప్పిన నతఁడు సమ్మతింపఁడు. నిక్కంపు హరిభక్తుఁడు తననేమ మేమైనను మానఁడు.

తానీ—ఒక మతమునననుసరించి యుండి యన్యమతస్థుని గురువుగ నంగీకరించినవానికిని నీరీతిగనే యన్యమత దైవతధ్యానము జేయువానికి నేనేమ మేకట్టుబాటుండును? ఇది యిట్లుండ బోవనున్న ప్రాణము సులభముగఁ దక్కునని రామదాసుకు తెలిసిన సంతసించి సమ్మతిపడును.

కబీ—అట్టులా ? హరిభక్తులచిత్తవృత్తి యిట్టిసుస్థితిలోనున్నదని పలికెదవుగా ?

తానీ—నేను బలుకనేల ? దీనినూఢపఱిచెదను. రమ్మునావెంట. నేను మఱుగుననుందును. నాసందేశమును నీవు రామదాసునకు చెప్పిన నతఁడు దప్పక యంగీకరించును.

కబీర్—కానిమ్ము, పోవుదము.

(నిష్క్రమింతురు.)

---

చతుర్థరంగము - చెఱసాల.

(అనుబంధము.)

రామ—రామచంద్రా ! వచ్చినట్లువచ్చి నన్నువిడనాడిపోయితివేల ?

పాట-నం. 55-రాగము యమన్‌మిశ్ర-తాళము-రూపకము.

రామనీదాసుపైన - ప్రేమబాయఁగోపమా ?

మోముజూపి మాయమైతె - స్వామినాదిపాపమా ॥రామ॥

1. గాసిజెందువానిఁగాంచి - యీసడింపన్యాయమా, ।
దోసమేమిచేసినాఁడనో-తోయజాక్షచూపుమా ॥రామ॥

2. ఆపడంతిద్రౌపదిమఱి - దాపుజెందితలఁచెనా ? ।
తాపమొందిమరలకరినీ - ప్రాపుఁగోరిపిలిచెనా, ॥రాము॥

3. వంతసైపఁజాలనింక - వారిజాక్షరాఘవా ।
సంతరింపనెంచిరమ్మి - సత్వరంబె శ్రీధవా ॥ రామనీ॥

రామా ! నాపాపాగ్నియొక్క వేడిమిని సహింపలేక వెడలి పోయితివా ? నాశత్రువులెవరైన నీకుగొండెములు చెప్పి వెనుకకు బంపిరా ? నాకన్న బ్రియులైనవారెవరన్న నిన్నుబిలిచిరా? మరలనేమైన గజేంద్రుని మకరము పట్టియున్నదా ? కుచేలుఁడు నినుదర్శింప వచ్చెనా ? సీతాలక్ష్మణులలో నెవరికైన నాపద గలిగినదా? ఏల మఱుఁగైతివి ? ఏల పలుకనైనఁ బలుకవు ? ఆహా ! నీవెదుటనేయున్నాఁడవు. పలుకుచునే యున్నాఁడవు. కాని నాకలుషము నాకన్నులకంధత్వమును, వీనులకు బాధిర్యముగలిగించియున్నది. ఈవ్యాధులను మాన్పి నన్ను రక్షించు పుణ్యాత్ముఁడవు రామా ! నీవేకదా !

కబీరు—(ప్రక్కనుండి) కాదు కాదు. తానీషారాజు నిన్ను రక్షించువాఁడు.

రామ—నన్ను రక్షించువాఁ డెవ్వఁడు ?

కబీ—తానీషారాజు.

రామ—మానవుడా ! నన్ను రక్షించువాఁడు.

కబీ—మానవపాలుఁడన్న నేమియర్థము ?

రామ—ఎవ్వ రీమాటలు పలుకునది ?

కబీ—(ముందటికి వచ్చి) నేను కబీరు.

[ప్రవేశము—కబీరుఁడు - వెనుక తానీషా]

రామ—గురువర్యా! నీవా? నమస్కృతులు. పుణ్యాత్మా! కలుషాత్ములకు నెలవైన నీచెఱసాలలోనికి నీవేల కాలిడితివి?

కబీ—రామదాసున్నాఁడని.

రామ—యోగిచంద్రమా! ఈరామదాసుండున దీరాత్రిమాత్రమే.

కబీ—అల్లేలందువు?

రామ—రాత్రి నాఋణము దీరకున్న తెల్లవారగనే నాశిరము తానీషాకరవాలమున ఖండింపఁబడును.

కబీ—నీఋణముదీరుట కుపాయమున్నది. నేను చెప్పినట్లు చేసెదవా?

రామ—చేయుదగినదైనఁ జేసెదను.

కబీ—రామదాసూ! నాయెడ నీ కనుమానమేల గలిగినది?

రామ—గురుచంద్రమా! నాకులకాంతయగునదియే నేను మోసవిధమునఁ దప్పించుకొనిపోవు నుపాయమున కొప్పినదని విన్నందుమొదలు నంతయు నాకు భయముగనేయున్నది.

కబీ—ఇంతభయమున్నవానికి మృత్యుభయ ముండునుగదా?

రామ—గురుపుంగవా! మీరా యిట్టిమాట నాతో నాడవలసినది? మృత్యువింక నేలరాకున్న దనియు, ప్రాణ మింకను బోకున్న దనియు భయమొందుచున్నాను. ఉదయ మేలకావలయును? ఇప్పుడే రాజు నాప్రాణమును బుచ్చుకొనిన సంతోషమున నిచ్చెదను. పూజ్యులగు మీకుఁ దెలియనిదేమున్నది.

కబీ—నాయనా! ఋణముదీర్పక మరణ మపేక్షించి ప్రాణము విడిచినఁ బాపము సపకీర్తియుఁ గలుగదా?

రామ—తండ్రీ! అట్టిపాపమును నపకీర్తిని బాపుటకుఁ బరమాత్ముని చరణధ్యానము సలిపెదను. ఇంతకన్న నెక్కువ నే నేమిచేయగలను?

కబీ—మనస్సుగలిగిన నీవు చేయఁజాలునది చెప్పెదను. భద్రాచలరాములయాభరణము లమ్ముటకును, దేవాలయమును, మహమ్మదీయపాఠశాలగఁ జేయుటకును నీవు సమ్మతింతువేని రాజేంద్రుఁడు దీనికంగీకరించి నిన్ను ఋణవిముక్తుని జేయును. నీవు సౌఖ్యముగ జీవింపఁగలవు.

రామ—(చెవులుమూసికొని) రామ! రామ! యెట్టికర్ణకఠోరవాక్కులివి? యోగీంద్రా! యీమాటల నీవే యాడితివా! లేక నా పాపపుదయ్య మిట్టిమాటలు నాచెవినివేసెనా? (అని కబీరుని బరికించి) నీవు నా కబీరుఁడవుగావు. నాగురుఁడవుగావు. నాకర్మపిశాచము మాయాకబీరురూపమున వచ్చియున్నది. నన్ను బాధించుచున్నది. పొమ్మావల. నాయెదుట నుండకుము.

కబీ—రామదాసూ! నీవేల—

రామ—నన్ను నరకమునకుఁ గొనిపోవచ్చియున్న యమకింకరా! యింకనోరుఁదెఱవకుము. నాయెదుట నుండకుము. పొమ్ము. పోకున్న నారామునిపాదమాన కలదు.

కబీ—(ప్రక్కకు జరిగి తానీషాయొద్దకుఁ బోవును.)

రామ—అయ్యో! నాముద్దులదేవుఁడు, నన్నుగన్నతండ్రి, నాభాగ్యజలధి, నావలపులవేల్పు, నాప్రేమంపుస్వామి, లోకపోషణానుమోదసద్గుణాభిరాముడు, సూర్యవంశపయోవారాశిసోముఁడు, సకలధారుణీపూజిత రాజలలాముఁడు, సాధురక్షణామేయ యశస్వీముఁడు, విమలసాకేతనగరధాముఁడు, ధర్మదశాత్రవవిరాముఁడు, నిశాచరగోత్రసుత్రాముఁడు, మేరుభూధరస్థైముడు, దేవతాసార్వభౌముఁడు, తోయదశ్యాముఁడు, నాదశరథరాముఁడు, ధరించియున్న యాభరణముల నూడదీయవలయునా? నాదేవుని భద్రగిరినుండి యరణ్యమునకుఁ బాఱఁదోలవలయునా?

ఓహో కైకేయీ! నీ వింకను రాముని పై మత్సరముఁబూనియున్నావే? నీదుష్టవాక్కుల నంగీకరింపను దశరథుఁడు లేఁడు. అదిగో నీ పుత్త్రుఁడు భరతుఁడే నిన్ను ఖండింప ఖడ్గపాణియై వచ్చుచున్నాఁడు. ప్రాణము గాపాడుకొనుము. పొమ్ము. పొమ్ము. స్వామీ! భరతా! నేను కైకేయిమాటలను వినను. ఆభరణము లడుగను. అడవికిఁ బంపను. నను జంపకుము. నా రాముని యొద్దకు నన్ను బిలుచుకొనిపొమ్ము. నీకు నమస్కరించెదను. (అని కూర్చుండి ధ్యానపరవశుఁడగును.)

కబీరు—(తానీషాతో ముందటికివచ్చి) రాజేంద్రా! దైవభక్తి యెట్లుండునది గాంచితివా? నేను బోయివచ్చెదను.

తానీ—ఇది కేవలము దైవభక్తియే కాదు. అప్పుతీర్పను శక్తిలేదని తెలిసి ప్రాణహానికి వెఱచి చిత్తచాంచల్యముచే యున్మాదావస్థ గలిగి తల్లడిల్లుచున్నాఁడు. ఈవెఱ్ఱిని నే నొకక్షణమునఁ బోఁగొట్టెదను.

కబీ—కానిమ్ము! నేను వెళ్లెదను.

తానీ—నీవు నుండిచూడుము.

కబీ—నీకు కాఁబోవునవమానమునకు సాక్షి యెందుకుండవలయును?

తానీ—నీవొక పిచ్చివాఁడవు. నీయిష్టము పొమ్ము.

కబీ— (నిష్క్రమించును.)

తానీ—(రామదాసునుసమీపించి) రామదాసూ! నిద్రబోవుచున్నావా?

రామ—ఎవరు నను బిల్చునది?

తానీ—నేను తానీషాను.

రామ—(శీఘ్రముగ లేచి) తెల్లవాఱినదా? రాజేంద్ర! సిద్ధముగ నున్నాఁడను.

తానీ—రామదాసూ! భయపడకుము. రాత్రి నాలుగుగడియలైనది. అంతియె. ఇంకను సాధనము నిచ్చునాస నీకున్నదా ?

రామ—లేదని నేను చెప్పను.

తానీ—అప్పుతీర్పఁజాలకున్న నీవు బ్రతుకు తెరువు యోచించితివా ?

రామ—అప్పుతీరనీ తీరకపోనీ! బ్రతుకు తెరువు నాకు వలదు. మృతి జెంది మరల జననము లేని తెరువు యోచించియున్నాఁడను.

తానీ—అది యెట్లు లభించును ?

రామ—రామనామధ్యానమువలన ?

తానీ—ఆఱులక్షలధనము నీకియ్యఁజాలని రాముఁడు వెలలేని మోక్షము నియ్యగలఁడా ?

రామ—కరుణగలిగెనేని ధనము మోక్షము నిచ్చు ధర్మాత్ముఁడా రాముఁడు.

తానీ—సీ. చెట్టుచాటునడాఁగి దిట్టవాలినిజంపు
దశరథసుతుఁడెట్టి ధర్మపరుఁడు

రామ—అన్యాయవిధముగాదని రామచంద్రుండు
వాలికిఁ దెలియఁగాఁ బలికినాఁడె

తానీ—పరిహాసమున నొక్కతరుణిని వంచించి
ముక్కుఁగోసినదుష్ట మూర్ఖుఁ డతఁడు

రామ—ఏకపత్నీవ్రతు లెంతటిఘనులంచు
నెల్లలోకంబులు నెఱుఁగఁజూపె

తానీ—అరినిమార్గ్గాన లేక సతనిసోదరుఁదీసి
యనిఁజేయు నారాముఁ డధికుఁడగునె ?

రామ—రాజధర్మము నెంచి రాముఁడు దురమాడె
నన్న దుష్టుఁడటంచు నన్నుజుఁడెడలె

తాసీ—అలకుంభకర్ణుడు యంత్రపుబొమయంచుఁ
గల్లలాడినవాఁడు ఖలుఁడుగాఁడె

రామ—అన్నిదేహంబులు యంత్రపుబొమ్మలే
రణభీతి నోర్వ నారాజవరుఁడు

తాసీ—గీ. వనితజాడ నెఱుఁగలేక వనరినట్టి
మనుజమాత్రుండుగాఁడె యాదనుజవైరి

రామ— దైవ మవనిపై వరమానవావతార
ములధరించి సత్పథములఁ దెలియఁజేయు.

తాసీ—నీరామునిధర్మగుణము నీవే పొగడవలయును. రణశూరుఁడగు వాలియెదుట నిలువఁజాలక భీరుఁడై మఱుగుననుండి మోసమున వధించిన నీరామునియధర్మము లోకమునకంతయుఁదెలియునే.

రామ—అన్యాయప్రవర్తనలంమన్న దుష్టులనెట్లుచంపినను నధర్మము గాదని యావాలికేచెప్పి యొప్పించియున్నాఁడు.

తాసీ—అన్నదమ్ము లిద్దఱు శూర్పణఖతోఁ బరిహాసములాడి దానిము క్కుఁజెవులు గోసిన దేన్యాయము ?

రామ—ఏకపత్నీవ్రతులగు పురుషులసంగమముఁ బలవంతముగఁగోరు స్త్రీలకుఁ దగినశిక్ష సూచించియున్నాఁడు.

తాసీ—భ్రాతృద్రోహియైనవిభీషణుని దగ్గఱఁజేర్చుకొని రహస్యము లెఱిఁగి మోసపుయుద్ధముఁజేసిన దెట్టిధర్మము ?

రామ—అన్నదుష్టుఁడైనఁ దమ్ముఁడు శిష్టులతోఁ జేరెను. రాముఁడు రాజధర్మరీతిగ యుద్ధమాడెను.

తాసీ—కుంభకర్ణునితో యుద్ధ మాడననిరాకరించిన సైనికులకు వాఁడు రాక్షసుఁడు గాడు. యంత్రపుబొమ్మ' యని రాముఁ డేల నబద్ధమాడెను ?

రామ—దేహములన్నియు యంత్రపుబొమ్మలనియే వేదాంతార్థము. అదిగాక బిడ్డలభయము బాపను తండ్రి సమాధానవచనము లెన్నియో చెప్పవచ్చును.

తానీ—రాముఁడు దేవుఁడైన సీత యెచ్చటనుండునదియు నేల యెఱుఁగఁడాయెను ? ఇంద్రజిత్తు మాయాసీతను వధించినప్పు డజ్ఞానియై యేల దుఃఖించెను ?

రామ—భగవంతుఁడు మానవశరీరము దాల్చినందున ప్రపంచమునకు బోధకరమైనచర్యలు చేయుచుండును.

తానీ—నీవు వెఱ్ఱివాఁడవు. నీభ్రాంతికి మేరయే లేదు. ఈవాదముపోనిమ్ము. నీరాముఁడు నీకియ్యజాలనివన్నియు నేను నీకిచ్చెద నేమందువు ?

రామ—అవి యేమి ?

తానీ—ఈక్షణమున నీచేతి కాఁబులక్షులపైక మిచ్చెదను. చెఱనుండి తప్పించెదను. నీకు మంత్రిత్వ మొసంగెదను. నీకుమారునకు నా పుత్రికనిచ్చి పెండ్లిజేసి యువరాజపట్టముఁ గట్టెదను. వలసినఁ జక్రవర్తినే చేసెదను. అన్నిటికిని సన్మతింపుము. తత్క్షణము నెఱవేర్చెదను.

రామ—రాజేంద్రా ! నీధనమువలను. అధికారమువలను. నాకుమారునకు రాజపదవివలను. వీటినన్నిటి నే తృణప్రాయముగ నెంచెదను. భూమండలములోఁగల సౌఖ్యములన్నియుఁ గూడినను రామనామకీర్తనానందసుఖములో సహస్రాంశమైనఁగావు.

తానీ—అయ్యో! వెఱ్ఱివాఁడా! ఇంటికివచ్చిన లక్ష్మిని కాలఁ దన్నుచున్నావే !

రామ—నీకంటికి లక్ష్మియై చూపట్టునది నాకు ఘోరసర్పమైకానవచ్చుచున్నది. వెఱ్ఱివానితో నీ కేటిమాటలు ? జ్ఞానులతోడను బ్రపంచకాములతోడను సంభాషింపఁ బొమ్ము.

తానీ—రామదాసు ! చక్కగ యోచింపుము. ఉదయమున నీతల నేలఁ గూలును.

రామ—రాముని చిత్తము.

తానీ—నీభార్యాపుత్రులు చెడుదురు.

రామ—రాముని చిత్తము.

తానీ—అయిన నిదినీయవసానసమయ మనుకొని నీకడపటికోరిక నాకుఁ జెప్పుము.

(అనుబంధము 56.)

రామ—ఈగడియనుండి తెల్లవారుటవఱకు నారామస్మరణ కేలాటివిఘ్నములు నీవు గలుగఁజేయకుము. ఇదియే నాకోరిక.

తానీ—నీమృత్యుప్రాప్తి నెవరు దప్పింపఁగలరు ?

రామ—ఆ రాముఁడు.

తానీ—నీకుఁ బిచ్చి తలకెక్కినది.

(నిష్క్రమించును.)

---

పంచమరంగము.

అహ్మక్: యిల్లు.

అహ్మ—మే రేదిల్ చోర్ చాందీ! ఎంథాదేకేషేస్తావ్ జల్దీరాగే ?

చాంది—(వచ్చి) ఊరక యెందుకు కొట్టుకొంటావు.

అహ్మ—నేనుకొట్టుకొంటాను లేదు గే. రాత్రిఅయింది. నీవునన్నిడ్సి యాడపోతావోకర్కె నాగుండ్య దడాక్ బడాక్ కొట్టుకుంటాడు. ఈడ ముట్టిసూడి (ఎదచూపును)

చాంది—ముట్టేమిచూచేది? నీకేమైందిచేటు? చింతముద్దా కట్టు న్నావే?

అహ్మ—(ఖుషీతో) నీవు సలామత్ వుంటె నాకీదౌలత్. రేపురాతిరి భద్రాచలంకి పోఆలె. సామాన్-గీమాన్-బాంద్కె-గింద్కె నీకీ తయార్ వుండావ్?

చాంది—ఎందుకుపోతావు భద్రాచలానికి చావను?

అహ్మ—సన్నేకీలేదు గే! భత్కేకీపోదాం. రేపుతెల్లారి రాందాస్కే నర్కేయేస్తారు, మనకలందర్ బేగ్ తహశీల్దారు వాస్కే నేను జమాదారు. నాకీ నీవు మజాదారు. కైసాహై?

చాంది—నేనురాను నీవేపో. (అని పోవుచుండును.)

అహ్మ—(అడ్డగించి) తైరోగే కైకు సేస్తావు గుస్సా?

చాంది—సొమ్ములు ల్యా, చీరలు ల్యా, భద్రాచలం యెవరువస్తారుపో.

అహ్మ—అంథేనా, (పెద్దగనవ్వి) ఇస్తిరీకి ఆస్మానవుండూడు ల్యా. వాండే సొమ్మల్ - వాండేచీరల్ - వాండేసంపత్ - వాండేగన్మత్ యింకెంత చెప్పాలె?

చాంది—నీవేమిచెప్పిన నొప్పను. నేను రాను.

అహ్మ—నీవు రా, ల్యాకుంటే నాపానాలే పోతాడు.

చాంది—పోతే మంచిదాయె.

అహ్మ—వీడుపానం నిన్నిడ్సిపోతాడా?

(అనుబంధము 57.)

(నిష్క్రమింతురు.)

షష్ఠరంగము.

తానీషా పడకటిల్లు.

తానీషా యొకవైపున-సితారాయొకవైపున-నిద్రించుచుండ

[ప్రవేశము-శ్రీరాముఁడు లక్ష్మణుఁడు సిఫాయిలై.]

శ్రీరా—తానీషారాజా! లెమ్ము.

తానీ—(దిగ్గునలేచి భార్యనుబిలిచి) సితారా! యెవరు నన్ను బిలిచిరి చూడుము.

సితా—(లేచిచూచి) ఎవరులేరే? నీవు కలగన్నావా? ఊరక శయనింపుము. (అని పండుకొనును.)

తానీ—అదిగోనిలుచున్నారు. (అని) ఎవ్వరచ్చట నిలిచియుండునది?

శ్రీరా—మేము రామదాసు సేవకులము.

తానీ—ఎచ్చటనుండి వచ్చితిరి?

శ్రీరా—భద్రాచలమునుండి వచ్చితిమి.

తానీ—ఈనిశీధమున నేల వచ్చితిరి?

శ్రీరా—రామదాసు పంపిన వచ్చితిమి.

తానీ—మాయంతఃపురములోని కెట్లు వచ్చితిరి?

శ్రీరా—కాళ్ళతో నడచి వచ్చితిమి.

తానీ—ఎవరియాజ్ఞ పుచ్చుకొని లోనికి వచ్చితిరి?

శ్రీరా—ఒకరియాజ్ఞకు మేము లోఁబడువారముగాము. మేము కోరిన చోటికి నిరాటంకముగఁ బోఁగలము.

తానీ—మీకులనామము లేవి?

శ్రీరా—మేము క్షత్రియులము, నాపేరు రామసింగ్, ఈనాతమ్ముని పేరు లక్ష్మణసింగ్.

తానీ—ఎన్నిదినములుగ మీరు రామదాసుకొలువుఁ జేయుచున్నారు?

శ్రీరా—అతని తాతకాలమునుండి కొలువుఁ జేయుచున్నాము.
తానీ—మీవయసెంత ?
శ్రీరా—మేము పుట్టియుండినగదా వయసుఁజెప్పవలె ?
తానీ—మీరు తుంటరులుగఁ గనిపించుచున్నారు ?
శ్రీరా—మేము తుంటరులను శిక్షించువారము.
తానీ—నోటికివచ్చినది పలుకుచున్నారు. మీకు రాజభయములేదా ?
శ్రీరా—అభయము చేతఁబట్టుకొనియుండుమా కెవరిభయమునులేదు.
తానీ—కాని మీ రెందుకు వచ్చియున్నారు ?
శ్రీరా—మారామదాసును చెఱనుండి విడిపింపను వచ్చియున్నాము.
తానీ—ఆచెఱసాలకే పొండు. ఇక్కడి కేలవచ్చితిరి ?
శ్రీరా—నీచేత విడుదలపత్రికవ్రాయించుకొనిపోవనువచ్చియున్నాము.
తానీ—నాధనముఁ దెచ్చియున్నారా ?
శ్రీరా—నిదానముగ నిచ్చెదము.
తానీ—నేను విడుదలపత్రిక నివ్వను.
శ్రీరా—నీ వీయకున్న మేము విడువము.
తానీ—అధర్మకార్యముఁ జేయను మీరు వచ్చియున్నారా ?
శ్రీరా—లేదు. నీయధర్మమును నీకుఁ జూపవచ్చినాము.
తానీ—నాదేమి యధర్మము ?
శ్రీరా—రామదాసు భద్రాచలమునకుఁ బోయి ధనముఁదెచ్చెదనని జెప్పినను విడువక నిర్బంధించితివి. నిరపరాధిని జేపుచంపను సిద్ధపడితివి. అధర్మమింకెట్లుండును ?
తానీ—రామదాసుచేతికి భద్రాచలదేవుఁడు ధనమిచ్చుచుండెనా ?
శ్రీరా—నీకు రాజ్యవిభవము నిచ్చినవానిమహిమఁ దెలిసికొనలేక యజ్ఞానివైన నీకేమిచెప్పిన నేమి ప్రయోజనము ?
తానీ—ఇంక నెక్కువ పొగరుమాటలాడక వెడలిపొండు.

శ్రీరా—పొగరువిడిచి రశీదు వ్రాసియిమ్ము.

తానీ—ఆఱులక్షలు ద్రవ్యమిమ్ము.

శ్రీరా—ఇచ్చెదను రసీదువ్రాయుము.

తానీ—ధనముజూచి వ్రాసెదను. నిన్ను నమ్మను.

శ్రీరా—నన్ను నమ్మకయే యీస్థితిలోనున్నాఁడవు. ఇదిగో పైకమెంచి కొను మాఱులక్షలు. (అని సంచులుచూపును.)

తానీ—(విస్మయమంది కన్నులుతుడుచుకొని చూచియూరకుండును.)

శ్రీరా—వ్రాయుము రసీదు.

తానీ—నేనువ్రాయను. ఇదియంతయు ఇంద్రజాలము. మాకావలివారు రామదాసైంద్రజాలికుండని చెప్పుచునేయుండిరి. ఇప్పుడు స్పష్ట మాయెను. తలుపులుమూసినగదిలోనికి మీరెట్లువచ్చితిరి? బాలురుమీరింతధనమెట్లు తెచ్చితిరి? ఇది మాయాధనమై యుండవచ్చును. నేను. తెల్లవారువఱకు నమ్మను.

శ్రీరా—నీవు నన్ను నమ్మకున్నను నేను నిను నమ్మి యింతధనమువిడిచి పోయెదను. రేపు నాకు రసీదుబంపుము. (అనిపోవుచుందురు.)

తానీ—మీరు పోకుఁడు. (అని వెంబడించును.)

(శ్రీరామలక్ష్మణులు నిష్క్రమింతురు.)

తానీ—ఆహా! ఈబాలకులున్నట్లుండి యదృశ్యులైరే? ఎవ్వరైయుండవచ్చును? (అని భార్యనులేపి) సితారా! ఇప్పుడువచ్చిపోయిన వారెవ్వరై యుండవచ్చును?

సితా—ఎవరువచ్చియుండిరి? నేను జూడలేదే? నాకేమితెలియును?

తానీ—నీకన్నులయెదుటనే రామసింగు లక్ష్మణసింగు అను నిద్దరన్న దమ్ములువచ్చి రామదాసును విడుదలచేయుటకై ధనమునిచ్చి పోయిరే?

సితా—నేను కన్ను దెఱచుకొనియే యుంటిని. నే నొకరినిజూడలేను. ఏమియు వినలేను. నీకుఁ గలవర మింకనుబోలేదు.

తానీ—సితారా! ఈధనమును జూడుము. ఇదియుఁ గలవరమేనా?

సితా—(ధనమునుజూచి) ఇవి రామమొహరీలు. ఇది రామదాసుభక్తి యొక్క ప్రభావము.

(అని మొహరీలనుఁ గన్నులకొత్తుకొని)

"అల్లా హో అక్బర్" (అనును.)

తానీ—సితారా! ఇదేమివిపరీతము? మహమ్మదీయులగువా రీతిగ హిందువులవిగ్రహములను దైవమనిభావించి మ్రొక్కఁజెల్లునా?

సితా—నాథా! నీనోటినుంచి యిటువంటివాక్కులను విన, నాకచ్చెరు వగుచున్నది. దైవభక్తి ముఖ్యముకాని, వివిధజనుల మతాచారభేదముల లెక్కింప మన కేమియక్కఱ? ప్రపంచమందు గల ప్రజలందఱును దేవుఁ డొక్కఁడే యనికదా కొలుచుచున్నారు? మనము "అల్లా" అని పూజింతుము, కొందఱు రాముఁడు, కృష్ణుడు, హనుమంతుఁడు, శివుఁడు అని వెయ్యిపేరులు పెట్టి భజింతురు. మనకు "కురాన్ షరీఫ్" భక్తిగ్రంథము. ఇతరులకు వేదోపనిషత్తులు మొదలగునవి పూజనీయగ్రంథములు. ఈ నిశీధివేళ నీకింతధనముఁ దెచ్చియిచ్చి చెరనున్నభక్తుని రక్షింపఁదలఁచునతఁడు "అల్లా" పరవర్దిగార్ గాక మఱియొక్కఁడగునా? ఈవిధముగ మనవారిలో పూర్వ మెందఱో భక్తులను భగవంతుఁడు రక్షించిన యెన్నియో యాశ్చర్యవిషయములు వ్రాసిన గ్రంథములు లేవా? పరమాత్ముని యీరేయిచరితము మనకు ప్రత్యక్షగ్రంథము. అల్లా యొక్క లీలలన్నియుఁదిలకింప లెక్కింప మానవుల శక్యమగునా?

పాట - నం. 58 - రాగము యమన్ - ఆదితాళము.

రామోజి రహిమాన్ - రబ్ కానిషాన్ ప్యార।
నామెయిన్ దోనోమె ఖుదాకషాన్ భర॥ రామొ॥

1. మస్ జీదె, దేవలె - మాలిక్ కా మందిరెహైం।
రసమ్, నమాజ్, పూజ - రబ్ పేనమాజరెహైం॥ రా॥

2. హిందు ముసల్ మాన్ కు - ఏక్ హి, ఖుదాహై,।
బందే దోనోఁకూభీ - భగవాన్ ఖాలిక్ హై॥ రా॥

తానీ—కాంతామణీ ? నాకు దిగ్భ్రమము కలిగి యొక్కటియుఁ దోచకున్నది. ఈరాజ్యవైభవసుఖంబులు మిథ్యలని విరాగభావముద్భవించియున్నది.

అహ్మక్ షా—(వెనుకనుండి) హుజూర్ ! గరీబ్ నివాజ్ ! పర్ వరిష్ కరో ? (అని అరచును)

తానీ—(విని) ఎవ్వరు కూయిచునది ?

అహ్మ—హుజూర్ - అహ్మక్ గులాంచచ్చుచున్నాడు. కావుము. కావుము.

తానీ—సితారా! మఱుగున కరుగుము.

సితా—(పరదా వెనుక కరుగును.)

తానీ—అహ్మక్ షా ! ఏమివార్త-రమ్ము నిమ్మళించి చెప్పుము.

అహ్మ—(వగర్చుచు - వంగి - వంగి సలాములు చేయుచు) మహాస్వామీ ; ఈరశీదు దేవరవారు జారీచేసినారని యిద్దరు కాఫిర్ సిఫాయిలు కాలుజాముసకుముందు నాచేతికిచ్చిరి. నేను నమ్మక వారినిఁబట్ట దలఁచితిని. వారు నా కగోచరులై పోయిరి. ఈరశీదు చిత్తగింపుఁడు.

తానీ—(చేతికందుకొనిచూచి, విస్మయమునణచుకొని) అహ్మక్‌షా! నిజమే. ఇదిగో, యాఱులక్షలపైకము. దీనిని ఖజానాకుఁ బంపెదను. నీవు జాగుచేయక చెఱసాలకుఁబోయి రామదాసును విడుదలఁజేసి యతనిని మర్యాదగ వాహ్యాళితో మేళతాళములతో నాగృహమునకుఁ గొనితెమ్ము.

అహ్మ—హుకుం సర్కార్.

(నిష్క్రమించును.)

తానీ—సితారా! ఈవింతరశీదునుజూడుము దీనిని నేను వ్రాసితినో లేదో నాకుఁదెలియదు. దీనిపైన నా మొహరు సంతకములున్నవి. ఇది కాగితముకాదు. వచ్చియుండినరామసింగ్ మొలధట్టితునుక యిది.

సితా—నాథా! నీవు పుణ్యాత్ముఁడవు కావుననే పరమాత్ముఁడు నీకు దర్శనమిచ్చిసంభాషించెను. నేను పాతకిని. కాంతా! నేను తొలుతనుండి రామదాసు పుణ్యపురుషుఁడని చెప్పలేదా! నీవు వినకపోతివి. అతనిని బాధపెట్టితివి. ఇప్పుడైన రామదాసును క్షమాపణవేఁడుము. వేగమె మంగళస్నానమాచరించుము. ఆలస్యముఁ జేయకుము.

తానీ—(ముందునకు నడచి సంతాపయుక్తుఁడై)

ఆయ్! ఖుదా! రహిమార్ ! ఖాలికె ఆలం !
తూహై హబీబె జగత్ -
యే - బందా - అగ్యార్, రాయకె జహన్నం
హై గరీబె కిస్మత్ -
అల్లా, దస్తగీర్ - గయా తూ కిధర్ - ఛోడే
బేకరార్ ముఝ్‌కూ యిధర్ ?
తూకియా హవామె బేఫికర్ రవానా -

మైహుఆహవాస్ మే, బేమస్ హూర్, దివానా 1
మత్ జావ్ తక్ లీఫ్ కీ కువామె ముఘకు -
ఛాండ్ కర్ - సాథ్ లేజావ్ యిస్ బేవకూఫ్ కా దువార్ మే
మార్ కర్.

యేనాదాస్ ఖుద్ బచన్ సున్ కర్ భి ఆప్ కునహిపహ్చానా - ఇద్ బదర్ మే - దోనయనేరహ్ కర్ భి బద్ గయా నాభీనా - మేరా షుక్ పర్ ఫర్మాయా ఆప్ నే రహంసే మొహబత్ కీ జులూస్ - సారా ఉమరేపర్నాయా రహుంగా మై ముసీబత్ మె మహబూర్ - యే, కంబఖ్ త్, రాంహీ రహీమార్ హై సోభేద్ కు, నహి పహ్చార్ లియా - ఐద్ వక్ త్ జామ్ మే భక్ దియాసో దూద్ కు, పీనా ఛాండ్ దియా - ఆయ్! ఖుదా ఇద్ కుసూర్ మంద్ కు ప్రేమ్ సే మాఫ్ కరో- ఫిదాహైసో ఫక్ జంద్ కా రంజ్ కుసాఫ్ కరో - నయర్ మిహర్ బానీ కీనజర్ ముఘపర్ డాలో - ఐష్ కీనిషామె ఫసీ మేరీ ఐబ్ కు నికాలో - తూ దియాసో దవలత్ కు తూహి లేలో - మోహ్ కా బంధన్ కు తోడ్ కర్ యిస్ దీద్ కు దయసే పాలో —

పాట-నం. 59-రాగము హిం॥ భైరవి-అటతాళము మొదటికాలం.

రామా! రహీమార్ - రహంపసారో
రహమత్ సమఝాకర్ - రంజ్ కు ఉతారో॥ రామా॥

1. రాత్ మే తుఘకుమై - నహీపహ్చానా
ప్రీత్ సే పాపీకు - తూహీబచానా॥ రామా॥

2. అల్లాతూ మోరీ షుర్ పె - ఆయాసా నహీజానా।
ఆంఖేఘురాకె మై - హువానాబీనా॥ రామా॥

(పాడుచు నిష్క్రమించును॥)

## సప్తమరంగము.

### వీధి.

[రామదాసును భటులు తానీషాయింటికి మర్యాదతో
పిలుచుకొని బోవుచుందురు.]

రామ—శా. రారారాఘవ! భద్రశైలనిలయా! రారాదయాసాగరా!
రారాఆశ్రితపాలకా! రఘువరా! రారాముకుందా! హరీ!
రారావారిజనేత్ర! రాజతిలకా! రారాగజేంద్రావనా!
రారారాజకులేంద్ర! రక్షకవరా! రారారమావల్లభా!

[ప్రవేశము- తానీషా.]

తానీ—రామదాసూ! నీనిర్మలభక్తి నెఱుఁగనేరక దైవతామహిమను దలఁపక ప్రపంచమాయాకామములంబడి ధనలోభుఁడనై మాన్యుఁడవైన నిన్ను హింసఁబెట్టితిని. నొప్పించితిని. నిన్నరేయి నీ అల్లా నాయింటికివచ్చి ధనమంతయునప్పగించిపోయెను. నాయపరాధములను క్షమింపుము.

పాట- నం. 60 - రాగము అఠాణ - రూపకము.

కరుణించిచూపవయ్య - పరమాత్మ
రామచంద్రుని।
వరనీలమేఘశ్యాముని - సురలోక
సార్వభౌముని కరుణించి॥

1. ఘనమైనపాపమేను - గనలేకఁజేసినాఁడను।
అనుకంపజూపుచునను - ననఘాత్మ
బ్రోవవేడెదను కరుణించి॥

2. గురుపుణ్యచరితనేను - హరిసేవజేతునింకను।
వరభద్రశైలధాముని చరణంబె నమ్మి
వాఁడను॥ కరుణించి॥

రామ—తానీషా! నే నొక్కటియు నెఱుఁగను. నాశిరము నీకర్పింప వచ్చుచున్నాఁడను. సిద్ధుఁడనై యున్నాఁడను.

తానీ—సాధనమంతయు ముట్టియుండ నీశిరమును ఖండింపవలయునా?

రామ—నే నియ్యలేను. నాకుఁదెలియదు. ఇచ్చినవానిని నాకుఁ జూపుము. లేకున్న నాప్రాణములు దీసికొనుము. (అని యిద్దఱు నొకరినొకరు వేఁడికొనుచు కూర్చుందురు.)

[ప్రవేశము—కబీరుదాసు]

కబీ—తానీషా! రామదాసూ! ఇదియేమిసంవాదముఁ జేయుచున్నారు?

రామ—ఈ తానీషా నాయప్పుదీర్చినవానినైనఁ జూపవలయు, లేక నా తలనైన నఱుకవలయును.

తానీషా—యోగీంద్రా! అప్పుతీఱియుండ నితని నెట్లుశిక్షింతును? మీఅల్లా రాముని నాకుఁ జూపుము.

కబీ—తానీషా! ఆరామునితో నీకేమిపని? అతఁడుమానవుఁడు. అధర్మప్రవర్తకుడు. అసత్యవాది. దరిద్రుఁడు. భక్తులను రక్షింపలేనివాఁడు. నీవో భూపాలకుఁడవు. రామదాసునుమంత్రిగఁ జేసుకొఁజాలుదువు. అతనికొడుకును జక్రవర్తిగఁ జేయఁగలవు. సర్వశక్తుఁడవు.

తాని—పుణ్యపురుషా! మృతిజెందినవానిని శూలముతో నేలఁబొడచెదవు? నాసర్వాపరాధములను క్షమింపుము. అల్లా నాకొసంగిన యాఱులక్షలధనమును దానిజతకు నింకనాఱులక్షలుఁ జేర్చి అల్లాకే యర్పించితిని. ఆభద్రాచలమే అల్లా రామచందర్‌కు జహాగీరుగ సమర్పించితిని. నేఁ డాదిగ నారాజ్యభారము మానుకొంటిని. ఐహికసుఖములన్నియు పరిత్యజించితిని. దైవధ్యానముదప్ప నితరము నేనొల్లను.

(అనుబంధము 61.)

కబీ—తానీషా ! నీవు సామాన్యుడవు కావు. పుణ్యపురుషుఁడవు రమ్ము పోవుదము. మాఅల్లానుఁజూతువు.

అహ్మ—(కబీరునకు నమస్కారముఁజేసి) మహారాజ్ ! మేగేకుభీపర్ వర్రిష్‌కరో.

కబీ—ఆప్ కౌన్‌హై ?

అహ్మ—మేరేనాంహై అహ్మక్. యానేబేవకూఫ్ నాదార్ పాజీ పాగల్ గున్హాగార్. యేసబ్ ఛీజేభరాహువే పుల్లీకు రాంచాం దీకేపాస్ లేజానాచాహియే.

కబీ—అచ్ఛా ! తుమారాదిల్‌మే రాంచందర్‌కా యిబాదత్ కరో.

అహ్మ—బహుత్ అచ్ఛా ! రాంరాం, చాందచాంది (అని నృత్యము చేయును.)

---

## —॥ అష్టమరంగము ॥—

[రామ లక్ష్మణ సీత]

అందఱు—దేవులకు మ్రొక్కుదురు.

శ్రీరా—తానీషా ! రామదాసు ! మీమీకర్మానుభవములను మీరు నెఱవేర్చితిరి. పూర్వజన్మమున మీరిద్దఱు సహోదరులుగను, సజ్జనులుగనుంటిరి. ఒకతాపసిశాపవశంబునఁ జిలుకయై మానవ భాషనాడుచుండ నాచిలుక నీరామదాసుపట్టి పంజరములో నునిచి యదియెంతవేడినను విడువక యేడుదినములు నిర్బంధించెను. చిలుక శాపఫల మిప్పు డనుభవించెను. ఈ తానీషా

మోక్షాభిలాషచేత తపస్సుఁ జేయుచుండి పరమాత్ముఁడు ప్రత్యక్షమగు సమయంబున తపోభంగముఁ గావింపవచ్చిన గంధర్వస్త్రీని గాంచి కాముకుఁడైనందున భూపాలకుఁడై జనించెను. ఆగంధర్వాంగనయే యీసితారా. ఆగరుత్మంతుఁ డీకబీరుఁడు. అచిరకాలంబుననే మిమ్ములను వైకుంఠమునకుఁ బిలిపించెదను. మీకు శుభమగుగాక.

అహ్మక్—స్వామీ! నే నెవ్వఁడను ?

శ్రీరా—నీవు రామదాసుపట్టియుండిన చిలుకవు.

అహ్మక్—నా ఱెక్క లేమాయెను ?

శ్రీరా—ఈ నాగరుత్మంతునకు ఱెక్కలువచ్చినప్పుడు నీకును రాఁగలవు.

అహ్మక్—(సాష్టాంగదండ ప్రణామమాచరించును.)

మంగళము. (అనుబంధము 62.)

శ్రీరామదాసు నాటకము సంపూర్ణము.

# అనుబంధములు.

## (APPENDIX.)

### 1. (బ్రాహ్మణులు) కల్యాణిరాగము ఆదితాళము.

రాఘవధరణిసుతాధవ గురువిభవ,
రవికులపుంగవ॥ రాఘ॥

దానవమర్దన, దశరథనందన । తామసభంజన, ధర్మగుణా !
తాపవిదారణ, తత్వవిచారణ । తాపస జనస్తుతి పారణా॥
రాఘవ॥ ౧

జానకీనాయక, సత్యవిధాయక । జ్ఞానప్రదీపక, శ్రీప్రదకా,
సజ్జనరక్షక, సౌఖ్యప్రదాయక । సామజపతిపరిపాలకా॥
రాఘవ॥ ౨

---

### 2. (అందఱు) రాగము యమన్మిశ్ర - తాళము ఆది.

* రామరామరఘు । రామపరాత్పర । రావణసంహార । రణధీరా,
రథాంగధరఘన । పతంగవాహన । రమారమణనారాయణా॥
రామరామ॥ ౧

సారశీలసురలోలనిరంజన । సత్వపరాయణసువిధానా ।
సరోజలోచన । సురేశపాలన । శరణ్య మునిబృందావనా॥
రామరామ॥ ౨

---

* ఈకీర్తన ౯౨-వ పేజీలో సీసపద్యము తరువాత పాడుకొనవలయును.

3. (దాసరి) రాగము యి॥ కాంబోజిమిశ్ర - ఆదితాళము.

శ్రీరామకీర్తన । చేతము చేతము ప్రేమతో రాముని బిలు
తము । బిలుతము॥ ౧

కోదండపాణిని । గొలుతము కొలుతము । వేదండపాలుని,
వేడుకగందము॥ ౨

తారకమంత్రము । తలుతము । తలుతము- కోరికలీడేర్చు
కొందము కొందము॥ 3

వాలిసంహారుని, వదలము, వదలము- మేలుగబూజించి మెప్పులు ।
దెత్తము॥ ౪

సుందరమూర్తిని । జూతము, చూతము । పొందుగ సేవకుఁ
బోదము । పోదము॥ ౫

4. (తురక) హిందూస్తానిరాగము - ఏకతాళము.

బుల్ బుల్ సె, హిల్ మిల్ కె । బహ్లానాడిల్కు
గోల్ గోల్ కె । అల్హాజ్ సె । బుల్వానాఉస్కు
ఆవ్ ! ఆవ్ । మేరీ । ప్యారా । దేవ్ । దేవ్ బూసా తేరా॥
బుల్ బుల్ సె॥ ౧

మానో మానో మేరీజాన్ । దేఖోనజర్ మెహిర్ బాన్
మెహుబం హర్దం తేరా । మాషూక్ కుర్బాన్
సున్ మేరీబాత్ । లాల్ తేరేహాత్ ! ఆవ్ మేరీసాథ్
ఆవ్ ! ఆవ్ । చెల్ । చెల్ । హిల్ । హిల్ । బుల్ బుల్
బుల్ బుల్ సె॥

5. (రెడ్లు) నాదనామక్రియరాగము - తాళము ఆది.

స్వామిసేవ । సేయబోదము ! నేడు సీతారాముసేవ సేయఁబోదము
జానకమ్మ, లచ్చుమన్న । చనువుతోడ రెండుదెసల
జానుగానుకొల్వరామ । చంద్రుఁడెంతముద్దుగాఉ

ఐదుజోళ్ళతలలవాని । నట్టెనేలఁ గూల్చెనన్న
ఆదిమూర్త్రిబహ్మమన్న । యందమైనదేవుఁడన॥
స్వామిసేవ । సేయఁబోదము ।
రాముసేవ । సేయఁబోదము।
లచ్చన్నసేవ । సేయఁబోదము ।
సీతమ్మసేవ । సేయఁబోదము॥ స్వామిసేవ॥

6. (రెడ్లు) శ్రీరాగము - ఆదితాళము.

ధర్మవంతురాలే, నీవు । తల్లిదమ్మక్కమ్మ॥ పల్లవి॥
పుణ్యమెంతయొచేసి రాముని బుట్టుమూర్త్తిని, బూజసేతువు॥ ౧
నిత్యసేవశ్రీ, నవమిజాతర, నిండుభక్తితో నీవుచేతువు॥ ౨
పావనంబునీ, మోముఁజూచిన, పోవుపాపము । పొందుమోక్షము॥ 3

7. (కబీరు) బేహాగురాగము - ఆదితాళము.

కహాఁఖాతిర్ సె, హారదం, రాంరాంరాం
నహీఁరహింగెకాయం, జహాఁమేహం॥ కహాఁ॥ పల్లవి.
దాలతెరనియా, తన్కఖుషీహై,
హాలతెస్ోచో, జాన్కకషీహై,
జాలమెయిఁసాన్, జాకెఫసీహై.
జీకుజురాత్, హాకెనజాత్, పానెసూరత్, దేఖోభాయీ
బద్కాగజబ్ జంకాతలబ్, టల్ నెసబబ్, దేఖోభాయీ,
దేరీనకర్, దిల్సెపుకార్, రాంరాంరాం॥ కహాఁ॥

8. (కబీరు) యమనరాగము - ఆదితాళము.

భోలోజిరంకా, నామహమేషా, ఔలోగునాహ్క, ఐబలందేషా॥ పల్లవి.
ఘఁదకిబిస్తర్ । హైజియేనునియా । బహార్ హైఉసపే । సాఁపకతకియా
ఫస్కేయిఁసాఁ । పాతాగిరియా । పర్వరిహైరాం । ధ్యానకెజరియా,

9. (కబీరు) జంఝూటిరాగము - ఏకతాళము.

ప్యాందియాసో । శజాసహుంగా । రాం తేరీపర్ రహాంకరేగా॥ ప్యాం॥

బైత్॥ బేవకూఫ్ పడేగా । పైతాఁ కాజాల్ మే

మాకూల్ బడేగా । షాదాఁ కాజలాల్ మే

ఘాజీజలెగా । దోజఖ్ కాఅగమే ౨

పాకీచలేగా బెహెష్తుకా బాగ్ మే

10. (కబీరు) పీలురాగము - ఆదితాళము.

దిల్ తో హమారె । చలనెతడప్రహీ

దేఖబినారాం । కైసాజావుం॥ దిల్ తో॥

ఆంఖెదియాతుంనే । అక్కల్ దియాతుంనే

అబ్ మైకెంకర్ । అంధాబఁనా। ౧

కహాఁతేరాసూరత్ । కమాల్ నజర్ ఆతీ

రహీంరాంచందర్ । వాహాఁ మైచెలుంగా।

11. (కబీరు) అసావేరిరాగం - ఏకతాళము.

దరషనదేవ్ రామా । తరసాతెహైహం

దాశరథేతేరా । చరనాకపల్కే॥ దరషన॥

జానకినాథా ।దయాకరోహమపర్ । మానోహమారాభజన

భువనగీర్ । రాంరాంసీతారాం । రావణసంహారసీతారాం॥

జానకిరమణా సీతారాం । దానవహరణాసీతారాం । పంకజ

నయనాసీతారాం । పన్నగశయనా సీతారాం । భద్రగిరీశా

సీతారాం । భవ్యవిలాసా సీతారాం॥ దరషన॥

12. (దిలారా) యమఁరాగము - ఆదితాళము:

దిలమొరెహైతుజపే । ఫిదాజానీ । దిఖలాతేరీ । దిలమోరిపే॥ దిల॥

హైయాజిమెప్యారీ । హమ్మొకినారే । హాసిలనికలే । దేమూసతేరీ

అషకహుంమైతుమారీ॥

13. (రఘురామ) రాగము - తాళము.

పాహిశ్రీరామా । సునామాభిరామ । రమానాథ వైకుంఠధామా
వనమాలీమానీంద్రకామా । విరాగసమా॥ పాహి॥
మేలుగమా సేవలగొమ్మా । పోలగమాకీర్తనల । నాలకింపురామా॥
పాలన సేయుమురామా । విలాససాంద్ర । లోకేశరామా॥ పాహి॥
జలజనయన । కలుషదమన । లలితసుగుణ । సాధుజనాధీనాసువిధానా॥
వరజ్ఞానానిదానా॥ పాహి॥

(గోపన్న - కమల.)

(అనుబంధము 14 పుస్తకములో చూడుడు.)

15. (కమలాంబ) రాగముమిశ్రసురటి - తాళము - అది.

మంగళంశ్రితమందారరామా । శృంగారనామా । శుభాంగాసుధామా॥
మంగళం॥
పంకజాక్షా । పరమపురుషా । శంకరవిధాతసన్నుతనేతా॥ మంగళం॥

16. (కబీరు) పూర్వికల్యాణి రాగము - ఆదితాళము.

జిందగిబేతాబ్ హైరేభాయీా చందహిరోజ్కేగిన్కేసమాయీా॥ జింద॥
జాక్హామారా పాజిజింససే । జబుహిలచల్తి హైకేబాహిర్ జోరు
లడ్కేజాతే దూర్ దూర్ । ముర్దాదేఖ్ కర్ బన్తె బేజార్ । సాత్ నికల్నే
నాహిమంజూర్ । సబ్కామొహబత్ । హూతీకాఫూర్॥ జిందగి॥

(అనుబంధము 17 పుస్తకములో చూడుడు.)

18 (రఘురామ) హిందూస్తాని రాగము - తాళము.

మోహనాకారరామా । మోహవిదారారామా॥ పల్లవి॥
లోకభరణనా । వ్యాకులమార్పన్ । నీకుఁగృపరాదా
శ్రీకరమగునీమోముచూప । శ్రీకాంతాయిటురారా । చింతదీర
సీతానాయకరారా.

19 (కమల - రాగము భీంపలాస్ - రూపకము.

పుణ్యమూర్తినన్ను మిగులఁ బొగడనీకు న్యాయమా
పూతమైనజ్ఞానమహిమఁ । బొలుచుయోగిచంద్రమా॥ పుణ్య॥
నాకుమారుఁ డెంతొసుఖానందమొందు నీయెడ
లోకతాపమించుకైన । లేకయుండుధన్యుఁడై॥ పుణ్య॥

20 (రామదాసు) పుస్తకములోన జూడుఁడు.

21 (కమల) పుస్తకములోన జూడుఁడు.

22 (రామదాసు) — డి —

23 (రామదాసు) — డి —

24 (కబీరు) — డి —

25 (కబీరు) — డి —

26 రఘు (రామ) హిందుస్తాని భైరవి - ఆదితాళము.

రామ పాహిమాం । సీతా । రామపాహిమాం
సాకేతనాథా । సామ్రాజ్యశోభిత । సాధుపోషణా రామ । శాంతీ
భూషణా రామ॥

27 (రామదాసు) మాయామాళవగౌళ రాగము-ఆదితాళము.

రఘువీర । రఘువీర । రఘువీర । రఘువీరదురితపరిహారరమ్య మణిహార
రమావరధీరా॥

పరధీరనమితసుర । వారసుజనపరి । వారమహారణశూరా
రణశూరభూరితర । ఘోరవైరిహర । మారజనకసువిచారా
సువిచారక్షేమకర । సారచక్రధర । నీరదాంగసుకుమారా॥ రఘు॥
శ్రీలోలసౌమ్యకరు । ణాలయమానిత । లీలసుధీజనపాలా
జనపాలమౌళిముని । లాలితకల్మష । కీలితజనతాభీలా
అభీలదైత్యకుల । కాలజనార్దన పాలితనిర్మదశీలా
మదశీలయుక్తఖల । జాలవిభంజన । ఖేలనకీర్తివిశాలా॥ రఘువీర॥

28 (రఘురామ) రాగము జంజూటిమిశ్రం-ఆదితాళము.

నీపదసరో । జమేశరణంబు । నిజమగునిరతిసేవింతు । శ్రీపతిహరీమురారీ॥ నీపద॥

కావుమునన్ను । కరుణాధామ । కడిమిగనన్నిటఁ గాంచుముప్రేమఁ నావగ బాపుము రామా । శ్రీపతిమురారీ॥ నీపద॥

29. (వేశ్య) హిందుస్తాని భైరవి-ఆదితాళము.

క్యైసీ । షీరీఁ । వాహ్వాషీరీఁ । అచ్ఛాషీరీఁ । క్యైసీ
షీరీఁ । వో । రంగీఁ । వో । హసీఁ । షరబత్
పీపేమెచమక్తీహై । గుల్‌నార్‌షర్‌బత్ ॥ క్యైసీషీరీఁ॥

| పౌరుఁడు. | వేశ్య. |
|---|---|
| గుల్‌నార్ | దిల్‌బార్ |
| మజాదార్ | సజావార్ |
| ప్యాలాభర్ | బెహెతర్ |

అందఱు । వాహ్వా । వాహ్వా । వాహ్వా । షీరీఁ । క్యైసీ॥ బెయిత్॥

ఉల్‌ఫతకీ జహాజపే । బిఠాకర్ । హూతీ । సఫర్ । ఖిల్‌వతకీ ।
జహాఁమే । ఉతాకర్ । దేతీ । జఫర్ । సందల్‌కి । ఖుష్‌బూ ।
బహ్లాతజిగర్ । అందాంకి । ఆజార్ । నిక్లాతీ । బాహిర్ । వాహ్వా
షరబత్ । దేతీబర్‌కత్ । బడ్తీకిస్‌మత్ । లాతీదౌలత్ ।
వాహ్వా, వాహ్వా । వాహ్వా । షిరీన్॥ క్యైసీషీరీఁ॥

30 (పౌరులు) పీలురాగము-ఏకతాళము.

సఖిహూతమిలీ । భాగెచలీ । మక్కారీ సఖ్ఖులి । హూంషజలీహై మేరీ ।
జానమేరాలేగయీ । బానమేరాలేగయీ । నానమేరాలేగయీ
జావోయాన్ । దేఖోకిధర్‌హైపరీ । షర్‌బత్‌పియాకే । దిల్‌మేభరీ॥

31. (రామదాసు-కమల) పుస్తకములోనఁ జూడుఁడు.

32. (రామదాసు) — డి —

33. (కమల) రాగము కన్నడ-రూపకతాళము.

దశరథరామ!హరిశౌరి! మురారి దానాభిరామాద నుజవిరామా॥ దశరథ॥

1. వరశాంతిగుణశీల । వైదేహీసతిలోల । సురలోకపాల, హరి ।
శౌరిమురారీ॥ దశరథ॥

2. చిరకాంతిసువిలాస । శ్రీభద్రగిరివాస । కరిరాజపోషాహరి ।
శౌరిమురారీ॥ దశరథ॥

34. (కమల) హింసుస్తానిరాగము-తాళము..

బాలరారా । ముదముమీర । వరకుమారా॥ బాల॥
మదినిప్రీతిలేకనిన్ను । మానిపోతిమనకుమన్న
మాతండ్రి । మమతఁబాయ । వలదు॥

35. (తానీషా-సితారా) రాగము యమన్-ఏకతాళము.

తానీ—ముఝెదిలగీర । నాహికరో । మోహిని । హలభలా
ఛోడోభలా । హెూరసీల॥ ముఝె॥

సితా—ధామొధామొజీ । జనాబ్ । ఝుమకు । ఝులకుబఙ ।
హబీబ్ । ముఝుకుకాహెకు । తైష్ । సునోప్యారా॥

తానీ—భోలిభోలి । తేరిబాతె । సునతెలగతి । మొహబతెదిల్
భులసజానొ । బినతిమానొ । సబరపెహనొ । కహరసహనొజాఙ॥

సితా—జాలిజాలి । కౌలతైహెజి । లబసెబనకె నికలతైహె
లఫజె సీల । మన । నిరాల । మరజి । బాల । సముఝి,నికలజావ్॥

36. (సితారా-తానీషా) పుస్తకములోనఁ జూడుఁడు.

37. బేహాగ్ రాగము-ఆదితాళము.

నీకేల నీత్వర ప్రాణేశ్వరా? ।
ఈకార్యంబున, నినునిందింపర ? నీకేల ।

1. వైరభావంబెంచియుండు । వారినుడులఁ నమ్మనేల ।
నేరవిచారము సలుపక బూజ్యునిఁ జెఱపట్టించెదు తెలిగిదిమేల ? ॥
నీకేల॥

38. (కమల) అసావేరి-రూపకము.

నిను౦బాసి నేనెట్లు, జీవింతునో వల్లభా, ఘనయాసమింతైన
సైరింతునా॥ నిను౦బాసి॥

1. ఏవేళనీపాదములఁ బాయక। సేవించుభాగ్యంబు లేదాయెఁగా

39. (కమల-రఘు - రామ - రామదాసు) పుస్తకములోనఁ జూడుఁడు.

40. (రఘురామ) రాగము యమన్ మిశ్ర-రూపకము.

పరీభావంబు। సైరిఁపఁగ। తరంబానా
వైరంబా। యోరా। మానా। పైన,
రమానాయకా। నాతంద్రిఁగ। రక్షింపవే
సమర్థుండవీవె। కాపాడఁగ। సరోజాక్షా॥ పరీభావంబు॥

41. (తానీషా) యమన్ రాగము-ఏకతాళము.

వినరామూర్ఖా। మనమునవింత। వినయములేక। జనపతితోడ
ఘనవాదంబును జేసెదవా॥
వెంగలివై। వైరంబెంచి। వికటంబగునీ। మాటలనాడు
వేడబము। విడరానీచా॥
అపరాధంబు నలయకజేసి। యపయశభారంబరిదిగడించి
కపటంబిఁకఁగ విడవా। హీనా?
ఔనికనీ। కనువాశిక్ష। అనుతాపము నీ। వారయలేవే
ఆదపనొందెదు వేగిరమే॥ వినరా॥

42. (సితారా) హిందుస్తాని (భైరవి) రాగము ఆదితాళము.

ధరణీవర, యీపగవలదు।
దరముగమాన్యుని। చెఱనిడఁజనదు॥ ధరణీవర॥
దైవవిచారుని। యీమహనీయుని। దారుణభంగిగ। దండనజేయగ
దఱుగనిపాతము। పరగునునిజముగ॥ ధరణీవర॥

43. (కమల) పుస్తకములోనఁ జూడుఁడు.

44. (కమల) — డి —

45. (సితారా) — డి —

46. (కమల) రాగము-తాళము.

ఇఁక నాకు దిక్కెవరుసుందరమ్మ । ఎట్లుసైతునమ్మ । విభుడు లేకున్న
హితుడైన ప్రాణనాథుని బాసి । యిలపైన నేనుమనజాలనమ్మ॥ ఇఁక॥
ఏడునాళ్లలోన । మాటవాసిగన । నేరీతిధన । మెనసియిచ్చును॥
ఇందిరేశుడా । రాముఁడేమెఱుంగు । నింకనాగతి । యెటులౌనోహా॥ఇఁక॥

47. (కమల-సితారా) పుస్తకములోనఁ జూడుఁడు.

48. (అహ్మక్) రాగము నాదనామక్రియ-ఏకతాళము.

అరరెకైసా । అజబ్ భరోసా । అదామెపైసా । కియాంరాందాసా,
తీనరోజుసే కుచ్ నహిఖాతా
జానని భానేపానిహిపీతా
సంజదగీసేగజసేగాతా
రంజిదగీసేరామెపుకార్తా
దినభరెరాం । షబ్ మెరాం । ఖాబ్ మేరాం । జాగ్తెరాం॥ అరరె॥

49. (రామదాసు) పుస్తకములోనఁ జూడుఁడు.

50. (రామదాసు) — డి —

51. (రామదాసు) రాగము-తాళము.

ననుగావరా । యినవంశచంద్ర । వనజాక్షునిన్నె । యనయమేఁ గొల్తు
జనపాలపుత్ర । జానకినాథా । కనికరమింతఁ । గనవయ్యరామ॥ నను॥
ఎంతుకయ్యనాపై । నింతఘోరచల । మొందితిమది । యందురాఘువా
మందరోద్ధరా । మాధవా । ముకుందా ఇందిరావరా యిఁకబ్రోవరా ॥

52. (రామదాసు) పుస్తకములోనఁ జూడుఁడు.

53. (రామదాసు.)

ఇవ్వరా । యివ్వరా । నాద్రవ్యమంత । నినకులాధీశా,
నమ్మికొలచినవానిబ్రోవక । సొమ్ముదోచితివి,
సమ్మదముగాభార్యతోడ । నిమ్ముజెందితివి॥ ౧
వింతయగు నీచరితమంతయు । వెలువరించెదను
వేగనాఋణమిచ్చువరకు । విడువనేనిన్ను॥ ౨

54. (కబీరు) హిందూ (భైరవి) రాగము-ఆదితాళము.

సనాకరోసజ్జనా । జనకజరమనక సనాకరో.
ష్యామసుందరక । హామతన సబుజన॥ సనా॥
బేత్, అల్లామె అజీముష్టానా కేహంద్ కరో చర్తీ ఆజుర్దగీ
జల్లాదకాతల్వారసేనహీండరో । మర్తీ ఆజాదగీ
ఖాతెపీతెకహారోనామరామకా । రాత్కుదిన్కుకరోధ్యానరామ
కా పాతెమోక్షసబు । రఘుపతి । భజనసె। సనా॥

55. (రామదాసు) పుస్తకములోనఁ జూడుఁడు.

56. (తానీషా-రామదాసు) రాగము-తాళము.

తానీ.—ఇదెనీమ్రుతి । సన్నిధిగానెంచి । మదిగలదేమో। మానకచెప్పుమా
రామ—హరికీర్తనెనా । యభిలాషంబు । పఱువడివేతే వాంఛయెలేదు॥
తానీ—పరికింపుమునీభార్యాసుతుల । ధరణినెవ్వరుభరియించెదరు మర
ణముగోరెదె మనమునసిం । త, గరుణములేని । కఠినాత్ముఁడవై
రామ—పరమాత్ముఁడునా । భద్రాచలశ్రీ । వరుఁడురాముఁడు । వరదా
యకుఁడు । భరణమునీకును । మఱినాకనుచు । నెఱుఁగవేనీవు.
ధరణీరమణా॥

57 (అష్టాక్ - చాందీ) ధన్యాసి - హిందూస్తానీ.

అష్మా—రా వెరా వెమాషూక । రంగుసేస్తాముగా

చాంది—పోరాపోరా బేకూఫ । పుగుసాటిమాట లే

అష్మా—నీ కేల నింతకోపం

చాంది—నాకున్న దేమిలాభం

అష్మా—షుందారిసొమ్ములిస్తా

చాంది—ముందుగ యిస్తేవస్తా

అష్మా—కుడుతాలుకోకలిస్తా

చాంది—తొడిగిస్తే యెంటవస్తా

అష్మా—నీకాళ్లు మొక్కుతాను । రాకుంటె సస్నిపోనా

చాంది—మక్కారిటక్కులకు చిక్కేటిదాన్ని నేనా

58. (సితారా) పుస్తకములోనఁ జూడుఁడు.

59. (తాసీపా) - డి -

60. - డి - - డి -

61. తాసీపా - హిందూస్తాని.

శ్రీరాముచరణాంబు । గారముతో నేను । సేవింపఁగోరెడువాఁడ
సరోజనేత్రుని । సురేశమిత్రుని । బిరానఁజూపుము । ధరాసురా
నేరక జేసిన । నేరంబులనుగాంచి । కారుణ్యమును బూనవయ్యా
సరసమతివై విరోధమునీ మదినిఁగొనక బ్రోవవయ్యా.

62. (మంగళము) బిల్హారిరాగము - ఆదితాళము.

శ్రీవరభద్రా చలసదన। అరిదమన
సరసీరుహాలోచనహరి.

1. వాసవసేవిత । భాసురభూషిత
వసుమతిసుత । వరగుణయుత
వనధివినుత । దశరథసుత

2. మంగళము । మారుతకు । మా । రనుత । మా । నా । థా
మానితరూపా । భంజితపాపా
మాయాతీతా, భూపా॥

అనుబంధములు సమాప్తము.

# మా స్వంత ప్రచురణములు

వలయువారిట్లు వ్రాయవలయును:—కురుకూరి సుబ్బారావు,
ప్రొప్రయిటరు, సరస్వతీ బుక్కుడిపో, బెజవాడ (కృష్ణాజిల్లా).

## —♦ స్టేజి నాటకములు ♦—

| | | |
|---|---|---|
| రంగూన్ రౌడి | సో॥ రా॥ | 1-0-0 |
| గంగావతరణం | డిటో | 1-0-0 |
| భీష్మబ్రహ్మచారి | డిటో | 1-0-0 |
| మహాభక్తవిజయము | డిటో | 1-0-0 |
| ధరణికోట (రెడ్లప్రతాపం) | డిటో | 1-4-0 |
| భోజకాళిదాసు | డిటో | 1-0-0 |
| సతీ అనసూయ | డిటో | 1-0-0 |
| కాలకేతనము | సో॥ రా॥ | 1-0-0 |
| సతీసక్కుబాయి | | 0-12-0 |
| తాజ్ మహల్ | సో॥ రా॥ | 1-0-0 |
| ప్రతాపరుద్రీయం | సో॥ రా॥ | 1-0-0 |
| ఆలీబాబా 40 దొంగలు | డిటో | 0-12-0 |
| సత్యహరిశ్చంద్ర | డిటో | 0-12-0 |
| సంగీతశశిరేఖ | సో॥ రా॥ | 0-8-0 |
| కోకిల | పా॥ ల॥ | 1-0-0 |
| విప్రనారాయణ | డిటో | 1-0-0 |
| రాధాకృష్ణ | డిటో | 0-12-0 |
| పాదుకాపట్టాభిషేకం | పా॥ ల॥ | 1-4-0 |
| శ్రీకృష్ణతులాభారము | ము॥ సు॥ | 1-0-0 |
| చంద్రగుప్త | డిటో | 1-0-0 |
| కచదేవయాని | డిటో | 1-0-0 |
| రణతిక్కన | డిటో | 1-0-0 |
| ద్రౌపదీవస్త్రాపహరణము | మ॥ అ॥ | 1-0-0 |
| కృష్ణలీల | డిటో | 1-0-0 |
| రంగూన్ మెయిల్ | | 1-0-0 |

సూ. పా. సా. శ

| | | |
|---|---|---|
| సత్యహరిశ్చంద్రీయం | బ॥ ల॥ | 1-0-0 |
| బుద్ధిమతీవిలాసం | డిటో | 1-0-0 |
| చండిక | ము॥ వెం॥ | 1-0-0 |
| పత్నీప్రతాప్ అను అనసూయ | సో॥ ఆ॥ | 1-0-0 |
| చింతామణి | కా॥ నా॥ | 1-0-0 |
| మధుసేవ | డిటో | 1-0-0 |
| జయంత జయపాలము | ఆ॥ స॥ | 0-12-0 |
| రసపుత్రవిజయం | ఇ॥ య॥ | 1-0-0 |
| రాణాప్రతాప్ సింగ్ | డిటో | 1-0-0 |
| చంద్రగుప్త | నం॥ శి॥ | 1-0-0 |
| దుర్గాదాసు | జం॥ శి॥ | 1-4-0 |
| రాణాప్రతాపసింహ | డిటో | 1-0-0 |
| బొబ్బిలి యుద్ధము | శ్రీ॥ కృ॥ | 1-0-0 |
| కృష్ణలీల బళ్లారి | కె॥ సు॥ | 1-4-0 |
| సంపూర్ణభారతం బళ్ళారి | కె॥ సు॥ | 1-0-0 |
| బలిబంధనము | చం॥ కే॥ | 1-0-0 |
| మోడరన్ బి. ఎ. | య॥ సూ॥ | 1-0-0 |
| వృద్ధవివాహము | గో॥ వేం॥ | 0-8-0 |
| *సక్కుబాయిసాంగ్సు | చం॥ కే॥ | 0-10-0 |
| రాధాకృష్ణసాంగ్సు | చం॥ కే॥ | 0-12-0 |
| తులాభారం సాంగ్సు | డిటో | 0-12-0 |
| ఏకిచ్ ప్యాలాసాంగ్సు | ప్ర॥ స॥ | 0-12-0 |

## —♦ ఆంధ్ర-నాటకములు ♦—

| | | |
|---|---|---|
| భక్తకబీర్ | కో॥ స॥ | 0-8-0 |
| పాదుకాపట్టాభిషేకము | డిటో | 0-8-0 |
| కాంతామతి | బ॥ కో॥ | 0-8-0 |
| శ్రీకృష్ణరాయబారం | డిటో | 0-8-0 |
| రోషనార (జహ్వారీబాయి) | | 0-8-0 |
| సంపూర్ణరామాయణము | | 0-12-0 |
| కుశలవ | జ॥ ల॥ | 0-8-0 |
| ఉషాపరిణయము | డిటో | 0-8-0 |
| శ్రీమతీదేవి | శ్రీ॥ త్రి॥ | 1-0-0 |
| రాధాకృష్ణలీల | కం॥ వే॥ | 0-8-0 |